# కృ త జ్ఞ త

1960 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో తణుకులో జరిగిన 21 వ ఆంధ్రనాటక కళాపరిషత్తులో ఉత్తమ ప్రదర్శన బహుమతినీ,

1960 వ సంవత్సరం మే నెలలో నరసాపురంలో జరిగిన 2 వ నాటక కళాపరిషత్తులో ఉత్తమ రచనగా ఎన్నికై రూ 1,116/- లున్నూ, తదితర బహుమతులున్నూ,

అందుకోగలిగిన ఉత్తమ స్థాయిలో అతి ప్రశంసనీయంగా

ప్ర ద ర్శ న లి చ్చి న

శ్రీ న వ్య క ళా మం డ లి, వి జ య వా డ

ఎమెచూర్ ఆర్టిస్టు ఎసోసియేషన్, కాకినాడ

వా రి కి

నా హృదయ పూర్వకమైన

అభివందనాలు.

# పాత్రల పరిచయం

1. మురారి : ఒకప్పుడు తెలుగు నాటక కళకి వన్నె తెచ్చిన నటుడు.
2. వాణీనాథం : సుప్రసిద్ధ తెలుగు కవి. నిండైన దరిద్రుడు. మురారికి తమ్ముడు.
3. జానకి : వాణీనాథం భార్య. సహనం, సంతృప్తి ఆవిడకి ఆభరణాలు.
4. జగన్నాథం · జానకి తండ్రి.
5. గంప శంకరయ్య : వ్యాపారరీత్యా సన్మానకర్త, వాణీనాథం ఉన్న ఇంటికి యజమాని.
6. శఠగోపం : దేశంలో పేరుమోసిన పబ్లిషరు.
7. జనతారావు : వాణీనాథం ఉన్న ఊరికి ఛైర్మన్.
8. డాక్టరు గంగాజలం.: ఆ వూళ్ళోకల్లా ఖరీదైనడాక్టరు.
9. హనుమంతరావు : ఆ వూళ్ళో జరుగుతున్న ప్రతీ పన్లోకీ పిలవకపోయే జొరబడి పోయే హడావుడి దాసు, పై పెచ్చు కౌన్సిలరు.
10. భైరవమూర్తి : ఆవూరికి సజీవమైన దూరశ్రవణ యంత్రం.

11. జమీందారు : డబ్బుకూడా ఉన్న జమీందారు. అంతకుమించి ఆవేశపరుడు.

12. గురవయ్య : గడ్డిరుచి బాగా తెలిసిన వ్యాపారస్తుడు.

13. పరంధామయ్య : బళ్ళో మేష్టరు, ఊళ్ళో దద్ధజనం.

14. గోపాలం : మహాశిల్పి.



[తణుకులో జరిగిన 21 వ ఆంధ్రనాటక కళాపరిషత్తులో 22–2–1960 వ తేదీని ఈ నాటకాన్ని ప్రదర్శించిన శ్రీ నవ్య కళామండలి, విజయవాడయొక్క నటీనటులు.]

| పాత్రలు | | పాత్రధారులు |
|---|---|---|
| 1. మురారి | : | శ్రీ R. గోపాలరావు |
| 2. వాణీనాథం | : | ,, S. శ్యామ్‌సుందర్ |
| 3. జానకి | : | శ్రీమతి Ch. వాణీబాల |
| 4. గంప శంకరయ్య | : | శ్రీ M. V. చలపతిరావు |
| 5. జగన్నాథం | : | ,, M.B.K.V. ప్రసాదరావు |
| 6. శఠగోపం | : | ,, A. వెంకటరావు |
| 7. జనతారావు | : | ,, S.V. సీతారామయ్య |
| 8. డాక్టరు గంగాజలం | : | ,, M.Y.V. ప్రసాదరావు |
| 9. హనుమంతరావు | : | ,, K.L.N. మూర్తి |
| 10. భైరవమూర్తి | : | ,, G. రాధాకృష్ణమూర్తి |
| 11. జమిందారు | : | ,, K. శివనారాయణ |
| 12. గురవయ్య | : | ,, వెంకటేశ్వరరావు |
| 13. పరంధామయ్య | : | ,, V. పార్థసారథి |
| 14. గోపాలం | : | ,, A. కృష్ణమూర్తి |

ఈ పరిషత్తులో వాణీనాథం పాత్రధారి శ్రీ S. శ్యామసుందర్ ఉత్తమ నటుడుగా గౌరవింపబడ్డారు.

[నరసాపురంలో జరిగిన నాటక కళాపరిషత్తులో 25–5–1960 వ తేదీని ఈ నాటకాన్ని ప్రదర్శించిన ఎమెచూర్ ఆర్టిస్టు ఎసోసియేషన్, కాకినాడయొక్క నటీనట వర్గం.]

| పాత్రలు | | పాత్రధారులు |
|---|---|---|
| 1. మురారి | : | శ్రీ R. గోపాలరావు |
| 2. వాణీనాథం | : | ,, M. సూర్యనారాయణ B.A. |
| 3. జానకి | : | శ్రీమతి సుబ్బలక్ష్మి |
| 4. జగన్నాథం | : | శ్రీ V.V. సుబ్రహ్మణ్యం |
| 5. గంప శంకరయ్య | : | ,, P. సీతాపతిరావు B.A. |
| 6. శఠగోపం | : | ,, E.S. శాస్త్రి L L.B. |
| 7. జనతారావు | : | ,, M. అప్పారావు |
| 8. డాక్టరు గంగాజలం | : | ,, P.L.N. మూర్తి |
| 9. హనుమంతరావు | : | ,, K. రంగారావు |
| 10. భైరవమూర్తి | : | ,, K. బాబూరావు |
| 11. జమీందారు | : | ,, M. వెంకటేశ్వరరావు |
| 12. గురవయ్య | : | ,, K. కృష్ణమూర్తి |
| 13. పరంధామయ్య | : | ,, I. జోగారావు |
| 14. గోపాలం | : | ,, మామిడి అప్పారావు |

ఈ పరిషత్తులో మురారి పాత్రధారి శ్రీ R. గోపాలరావు ఉత్తమ నటుడుగా గౌరవింపబడ్డారు.

# కీర్తిశేషులు

## రంగం - 1

[ తెరతప్పుకోగానే వాణీనాథంఇంట్లో హాలుగదికని పిస్తుంది. ఆ హాలులోకి రాకపోకలకి హాలు వెనకమధ్య (Middle Back - M. B.) లో ఒకటి, కుడిఎదర (Right Front - R. F ) లో మరొకటి, ఎడమ ఎదర Left Front L. F. లో వేరొకటి, మొత్తం మూడుమార్గాలుంటాయి. L. F. కి M. B కి మధ్యగా గోడనిఆనుకుని ఒకపాతరకం బల్ల, పక్కగా సమాన్యరకంకుర్చీ, ఆబల్లకింద చిన్నసైజు స్టూలు ఉంటాయి. ఆ బల్లమీాదే కొన్నిపుస్తకాలు, కాగితాలు, వెలిగించిన హరికేన్ లాంతరుఉండాలి. M B. కి R F. కి మధ్యగా గోడనిఆనుకుని మరోబల్ల, ఆబల్లమీాద నాలుగు అరలుకలిగిన షెల్ఫు, షెల్ఫునిండా పుస్తకాలు కనిపిస్తాయి. M B లోని గుమ్మానికి కుడిపక్కగా గోడనానుకుని చిన్నస్టూలు మరొకటిఉంటుంది. R .F కి M. B కి మధ్య ఒకదండెం, ఆదండెంమీాద చాలామటుకు సన్మానాల బాపతు ఖద్దరుశాలువాలు, కొన్ని ఇతరవస్త్రాలు వేళ్ళాడుతూంటాయి. గదిలోని రెండుబల్లలమీాదాకూడా ఆరకం సన్మానశాలువలు table cloths కింద ఉపయోగించవచ్చు. గదిగోడలనిండామాత్రం సన్మానపత్రాలు కిక్కిరిసి కూచుంటాయి. బెల్లులు ఊడిపోయి అక్కడక్కడ గోడలో ఇటికలు

కనిపిస్తూ వెల్లమాసిపోయి వెలవెలపోతున్న ఆహాలుసూడ
గానే నిఖార్సైన దరిద్రముశిబస అనిపిస్తుంది.

L. F. లోని ద్వారం అవతలనుంచి తలుపుతట్టినశబ్దం. ''జానకీ !—జానకీ !'' అన్నపిలుపు స్ఫుటంగా వినిపిస్తాయి. తరువాత కొద్దిక్షణాల్లో R. F లోని ద్వారంలోంచి జానకి వచ్చి L. F. వైపు నడుస్తుంది. అంతలోనే మళ్ళీ''జానకీ–'' అని పిలుపువినిపిస్తుంది.]

జాన : (వెడుతూ) వస్తున్నా ! (అంటూ పమిట చెంగుతో కళ్ళు అదుర్దాగా వత్తుకుంటూ L F లో ఉన్న తలుపుతీస్తుంది. వాణీనాథం ఉత్సాహంతో ప్రవేశిస్తాడు. ముతకరకం పంచ, పాతరకంలాల్చీ, అతని వస్త్రాలు. అతనిచేతులో మనోసన్మానపత్రం, పూల దండా, సన్మానశాలువా ఉంటాయి.)

వాణీ : (పత్రం, శాలువా జానకికి అందిస్తూ) ఏం జానకీ !— నిద్రపోతున్నావా ?

జాన : లేదండీ ! (అని అవిపేసుగుని బల్లమీాద పెడుతుంది)

వాణీ : ఇటుతిరుగు, జానకీ ! (జానకి తనవైపు తిరగ్గానే చేతిలోదండ ఆమె మెడలోవేస్తాడు.)

జాన : (సిగ్గుపడి, చిరునవ్వుతో) ఇదేమిటండీ !—(అంటూ తీసేస్తుంది)

వాణీ : (ఆనందంతో) ఈరోజునాకు జరిగిన గౌరవంలో నీభాగం ! ఈవాళ నాకు చాలాఆనందంగా ఉంది,

ఏమని చెప్పను. ఆ సన్మానవైభవం! — నిన్ను రమ్మంటే వచ్చావుకాదుగదా!

జాన : క్షమించండి. రాలేకపోయాను—సన్మానం ఎల్లాజరిగింది, చెప్పండి!

వాణీ : అపూర్వంగా జరిగింది, జానకీ! అపూర్వంగాజరిగింది. (అంటూ జానకిని కుర్చీలో కూచుండచేసి) జనబాహుళ్యంతో కిక్కిరిసిపోయిన మన పురపాలక సంఘభవనంలో వేదికపైన నన్ను కూర్చోపెట్టి, ఛైర్మన్‌గారు నా పక్కనే నిలబడి, నాకు నమస్కరించి ఏమన్నారో తెలుసా?......యావదాంధ్ర దేశాన్ని ఉర్రూతలూగించే నవ్యకవిత్వాన్ని మధురాతి మధురంగా చిలికించే ఈకవిరాజు ఆంధ్ర సంస్కృతి సంపదకి ఒక వెలలేని మణిపూస. ఆంధ్రులకి అత్యంత గర్వకారణమైన ఇట్టి యువకవి మన పట్టణానికే చెందడం కేవలం మన అదృష్టం! ఈ మహనీయునికి చంద్రునికో నూలుపోగు అన్నట్లు మన పట్టణం తరఫున ఈఖద్దరు శాలువా, ఈ సన్మానపత్రమూ సమర్పించుకుంటున్నాను, అనగానే దిక్కులు మారుమ్రోగేలా సభలోని ప్రజావాహినిచేసిన హర్షధ్వానాలు—(తన్మయుడై ఆనందభాష్పాలతో) జానకీ!—నాజన్మని తరింపజేశాయి.

జాన : (ఆనందంతో కన్నీళ్ళు తుడుచుకుంటూ) నేనెంత అదృష్టవంతురాల్ని! (అంటూ భర్తనిసమీపిస్తుంది.)

వాణీ : ఆతరువాత సమాధానం చెబుదామని నిలబడ్డాను నోటమాటరాలేదు. జానకీ! ఆ ఆదరం, ఆ అభిమానం, ఆ అంతఃకరణ నన్ను పూర్తిగా పరవశింపజేశాయి!—ఏం చెప్పానో నాకే తెలియదు—హాలు బయటికి రాగానే జనం నన్ను చుట్టుముట్టి ఈప్రస్తుత గ్రంథం ఎప్పుడు అచ్చువేస్తారని, ఎంత ఆతృతగా అడిగారనుకున్నావు!—త్వరగా అచ్చువేయించమని కొంతమంది ప్రాధేయపడ్డారుకూడా!—

జాన : ఆ శఠగోపంగారే అచ్చువేస్తా రన్నారుగా?

వాణీ : ఎందుకు వెయ్యరూ?—తప్పకుండా వేస్తారు! వారూ వచ్చారు సభకి. శఠగోపంగారికి నే నంటే ఎంతగౌరవమనుకున్నావ్!—ఎగ్రిమెంటు రాసుగుని గ్రంథం తీసుగువెళ్ళడానికి వారు ఈరాత్రే మనింటికి స్వయంగా వస్తామన్నారు. వారికే ఇస్తానని మనస్ఫూర్తిగా వాగ్దానంకూడా చేసేశాను!— (ఆప్యాయంతో చూస్తూ వెళ్ళి షెల్ఫుమీదఉన్న పెద్దకాగితాలకట్ట తీసుగుని, మురిసిపోతూ) ప్రజారంజకుడైన కవికంటూ సుఖవంతుడైన మనిషి మరొకడుంటాడా ఈ ప్రపంచకంలో! అయిదు సంవత్సరాల అకుంఠిత కృషిఫలితం ఈ నా స్వకల్పిత కావ్యం!—దీన్ని సరసశిఖామణులైన నా ఆంధ్రప్రజల పాదాలకి అంకితం చేస్తాను.

జాన : అయితే శఠగోపంగారు ఇప్పుడు వస్తారా?

వాణీ : ఏం ?

జాన : బాగా నేడుంది—ఇల్లంతా ఎల్లాఉందో చూడండి !

వాణీ : ఇంటికేం ? దివ్యంగాఉంది !—అనవసరంగా ఆరాట పడక, వెంటనే వడ్డించు. భోంచేసి కూచుంటాను. (అని కాగితాలకట్ట L. F. దగ్గర ఉన్న డ్రాయరు మీద పెట్టి, ఉత్సాహంతో లాల్చీ బొత్తాములు విడదీస్తూంటాడు. జానకి R. F. కి దగ్గరగా, R. F. వైపు తిరిగి ఏడుపు ఆపుగోలేక నోట్లో చీర కుక్కు-గుంటుంది) అన్నయ్య ఇంకా రాలేదా, జానకీ !

జాన : (గద్గదికంగా) రాలేదు !

వాణీ : (జానికిని సమీపిస్తూ) ఎల్లామరి ? ఎక్కడ తిరుగు తున్నాడో ఏమిటో !—నాకు బాగా ఆకలేస్తోంది. పైగా పనుంది. నాకు వడ్డించెయ్యి ! (దుఃఖం ఇంక ఆపుగోలేక చేతుల్లో మొహం దాచుగుని ఏడ్చేస్తుంది. జానకి.) అదేమిటె, జానకీ ?

జాన : వంట చెయ్యలేదండీ !—

వాణీ : ఆమాత్రం దానికే ఇంతబాధ పడతావెందుకే !—వొంట్లో బాగుండకపోతే నువ్వుమాత్రం ఏంచేస్తావు ?

జాన : అదికాదండీ !—బియ్యం నిండుకున్నాయి !

వాణీ : అదేమిటీ ?—మధ్యాహ్నం అయిదు రూపాయలూ ఇచ్చి వెళ్ళానుగా ?—నీమందుకే సరిపోయిందా ?

జాన : లేదండి. మందూ కొనలేదు.

వాణీ : మరేంచేశావు ?

జాన : నిర్ధారిచ్చినడబ్బు ఆ బల్లమీద పెట్టి, డాక్టరమ్మ రాసిచ్చిన కాగితంకోసం లోపలికి వెళ్ళాను. ఇంతలో మీ అన్నయ్య ఆ గదిలోంచి వచ్చి నోటు తీసుగుని వీధులోకి వెళ్ళిపోయారు.

వాణీ : (ఆశ్చర్యంగా, బాధగా). ఆ !—అయితే అన్నయ్య మళ్ళీ తాగుడు ప్రారంభించాడన్నమాట !—పైగా దొంగతనం కూడానా ? (తడబడే అడుగులతో వెళ్ళి, కుర్చీలో చతికిలపడి, బాధగా తల పట్టుగుని) అన్నయ్యా !—

జాన : పోయిన సొమ్ము మన డబ్బుకాదు !— మీరాట్టే బాధపడకండి !

వాణీ : వైద్యపడబ్బు, డబ్బుకోసంకాదు, జానకీ !—జానకీ !—(ఆవేదనతో) అన్నయ్య మనకింక దక్కడు !

జాన : అవేం మాట్లండీ ?

వాణీ : నీకు తెలియదు, జానకీ !—అన్నయ్య ఈవాళ పొద్దున్న దగ్గుతూ ఇంత–ఇంత నెత్తురు కక్కుగున్నాడు !

జాన : (తెల్లబోయి, భయంగా) ఆ !—నెత్తురే !

వాణీ : (నీళ్ళు నిండినకళ్ళతో, హతాశుడైనట్లు చూస్తూ) విధివశం !—ఎటువంటి అన్నయ్య ఎల్లా అయిపోయాడు! M A. చదివాడు. పండితులచేత కూడా భళీ అనిపించుగున్న ప్రజ్ఞాశాలి. అంతకుమించి కళారాధనల్లో

కైవల్యుడైన నటశేఖరుడు. పత్రికల పంక్తులలోనూ, ప్రజలనోళ్ళల్లోనూ, అన్నయ్య పేరుప్రతిష్టలు ఫెళ ఫెళ లాడిపోయాయికదా. జానకీ! —ఆరోజుల్లో! దేశంలో ఎక్కడ ఎంత నాటకపరిషత్తు జరిగినా అన్నయ్యే ఉత్తమనటుడు. చివరికి మద్రాసుసభలో మహారాజుదగ్గర్నుంచి, నటరాజుబిరుదు అందు కున్నాడు !— (అని ఇంకమాట్లాడలేక తలవంచేసు కుంటాడు.)

జాన : ఏమిటండిదీ ? మీరే ఇల్లాఅయితే ఎల్లా ?

వాణీ : అదికాదు, జానకీ! అటువంటి పురుషోత్తముడైన అన్నయ్య, నిండైనజీవితాన్ని నేలపాలుచేసుకుని, వ్యర్థజీవిగామారి. క్షుద్రమనస్కుడై, చివరికి నీచాతి నీచమైన త్రాగుడికి బానిసయి, నెత్తురుకక్కుకుని అధమాధమమైన చావు ఛస్తాడంటే—(ఏడ్చేస్తూ) నేను భరించలేకుండా ఉన్నాను, జానకీ!

జాన : అల్లా ఎప్పటికీజరగదు! ఇప్పుడు శరగోపంగారు వస్తారుగా ? మీ గ్రంథానికి వారు ఇచ్చినడబ్బుతో ముందు బావగార్ని ఏ పెద్దఆసుపత్రికయినా పంపించి మంచి వైద్యంచేయిస్తే తప్పకుండా నయమవుతుంది.

వాణీ : ఏమో, జానకీ!

జాన : మీరింకేమీ ఆలోచించకండి !—అన్నిటికీ ఆభగ వంతుడే ఉన్నాడు. నమ్మిప్రయత్నించడం మన కర్తవ్యం!

వాణీ : అంతే! — భగవంతు డొక్కడే రక్షించాలి. (నిట్టూర్చి) సరే!—కొంచెంమంచినీళ్ళు తెచ్చిపెట్టు!

జాన : కాఫీ తెస్తానుండండి!

వాణీ : (ఆశ్చర్యంగా) కాఫీయా? — పాలమనిషిమానే సిందిగా?

జాన : పాతడబ్బాలు వెతుగుతూంటే రెండుచెమిచాల పాల పొడుం దొరికింది. కాఫీకలిపి అట్టేపెట్టాను.

వాణీ : అల్లానా?—సరే తీసుకురా!

[జానకి R. F లోకి వెడుతుంది. వాణీనాథం కుర్చీ బల్ల దగ్గరగా జరుపుకుని, కాగితాలకట్టతీసి, కళ్ళకద్దుకుని, కొన్ని పేజీలుతీసి, చదువుతూ ఏవో వ్రాయడానికి ఉపక్రమించ బోతూంటే L. F. లోంచి "వాణీనాథంగారూ! — వాణీ నాథంగారూ!—" అని పిలుపువినిపిస్తుంది.]

వాణీ : ఎవరది? (అంటూ లేస్తాడు. L. F.లోఉన్న శంక రయ్యని లోపలకి ఆహ్వానిస్తాడు.) రండి, శంకరయ్య గారూ!

శంక : (ప్రవేశిస్తూ) నమస్కారమండి, కవిగారూ!

వాణీ : దయచేయండి! (అని కుర్చీచూపిస్తాడు.)

శంక : (చిరునవ్వుతోకూచోబోయి, ఎదోజ్ఞాపకంవచ్చినట్టు ఆగి బిగుసుగుపోయి) మీ అన్నయ్యగారు—ఏదీ?— మురారిగారు—లోపలఉన్నారా!

వాణీ : అల్లా వీధులో కెళ్ళాడు.

శంక : అయితే, సరే! (హాయిగా నిట్టూర్చి, కుర్చీలో కూర్చుని) ఆయన మరీ అల్లాఉంటారేమిటండీ ?—అతగాణ్ణిచూస్తేనే నాకుదడ. ఇంక ఆయన పలకరిస్తే—ఎదీ ?—నా ప్రాణం సమూలంగా పికారెడుతుంది! (అని హాయిగా నవ్వి తనవైపే గంభీరంగా చూస్తూ నిలబడ్డ వాణీనాథాన్ని చూసి, నవ్వాపుమింగేసి వెఱ్ఱిమొహం సాయంతో) తమరు నిలబడే ఉన్నారు?

వాణీ : ఫరవాలేదులెండి!— మీరు ఇంటి అద్దెగురించి వచ్చుంటారు. మీకు ఇవ్వవలసిన మూడునెలల అద్దీ రేపు ఉదయం అణాపైసల్తో మీకిచ్చేస్తాను.

శంక : చాల్లెద్దురూ, కవిగారూ!—మూణ్ణెల్ల అద్దీ ఏభై రూపాయలు. ఆమాత్రం దానికోసం మిమ్మల్ని ఇబ్బంది పెడతానా ?—ఉన్నప్పుడే ఇవ్వండి. అసలు, మీ అంత పేరు ప్రతిష్టలుగల మహాకవులు మా ఇంట్లో అద్దెకు ఉన్నారంటే మాకు గౌరవం కదుటండీ!

వాణీ : మీ అభిమానానికి చాలా కృతజ్ఞుణ్ణి!

శంక : చిత్తం!—ఆ విద్యాసంపదకి సాయం ఎంతవినయం!—(ఇంతలో R. F లోంచి జానకి కాఫీగ్లాసు తీసుగుని వస్తుంది.) అబ్బో, అబ్బో!—జానికమ్మగారు అప్పుడే ఎదో తెస్తున్నారు కూడాను!—ఎంతమర్యాద!—ఎంతఇది!—ఆ కవిగారికి తగ్గ ఇల్లాలివమ్మా నువ్వు! (జానకి తెల్లబోయి ఆగి, వాణీనాథంకేసి వెఱ్ఱిగా

చూస్తుంది. వాణీనాథం జాలిగానవ్వి. ఒక్క-క్షణం జానకి కళ్ళల్లోకి చూసి, గ్లాసు అందుకుని, చిరునవ్వుతో శంకరయ్యకేసి తిరుగుతాడు.)

వాణీ : కాఫీతీసుగోండి, శంకరయ్యగారూ !

శంక : (ఉత్సాహంతో అందుకుని) ఆ !—ఇప్పుడెందుకండీ, మీకు చాదస్తంగాని !—(కొంచెంతాగి) ఒహో !—కాఫీ దివ్యంగాఉంది ! (అంటూ పూర్తిగా పుచ్చుకుంటాడు. జానకి మరోసారి వాణీనాథంకేసి, నీళ్ళు నిండిన కళ్ళతో చూసి, ఆవేదనతో R. F. లోకి వెళ్ళిపోతుంది.) ఒక్కొక్క చెయ్యి ప్రభావమండీ !—మొన్న మా అమ్మాయికి ఫస్టుక్లాసయిన పెళ్ళిసంబంధం తోలుకొచ్చాను. వచ్చిన పెళ్ళివారికి మాఆవిడ—ఎదీ ?—ప్రేమలుకాఫీ ఇచ్చింది. అది కొంచెంతాగి వాళ్ళు వంటాముదం తాగినట్టు మొహాలెట్టుగుని వెనకచూపులేకుండా చక్కాపోయారు ! (అని నవ్వుతాడు.)

వాణీ : అయితేంలెండి !—ధనవంతులకి లోటేమిటి!—ఒకటి కాకపోతే మరొకటి !

శంక : అల్లానేమరి !—(మంచిగా, చిరకోపంతో) అయినా, వాణీనాథంగారూ !—మీవరస నాకేమీ బాగాలేదు.

వాణీ : అదేమిటండీ ?

శంక : (లేస్తూ) లేకపోతే ఏమిటండిదీ?—మిమ్మల్ని అసలు సన్మానానికి ఈవాళ ఎవరు ఒప్పుగోమన్నారు ?

వాణీ : ఏం ?

శంక : ఏమేమిటండీ ?—మీబోటి మహాకవులకి–ఎదీ ?— సన్మానం జరగవలసిన రీతి అదేనా ?

వాణీ : దాంట్లో అపసవ్యం ఏముందీ ?

శంక : ఏముందీ అంటున్నారా, మెల్లిగా ?–హు !–బోల్డుంది– ఎదీ ?–బోల్డుందండీ !–అంతే !—దేశానికి మణిపూస లాంటి మహాకవికి దేశంలోని పెద్దపట్టణం తరఫుని సభచేసి ఓ సన్మానపత్రమూ, ఓ ఖద్దరు శాలువానా ఇవ్వడం ?–పెళ్ళిలో జేబురుమాళ్ళు పంచిపెట్టినట్టు, మెడమీద తలకాయలేని వాడికికూడా సన్మాన పత్రాలు దానం చేస్తున్న ఈ రోజుల్లో సన్మాన పత్రానికి గౌరవం ఏమేడిసిందండీ ? ఇల్లాంటి మనో వర్తి సన్మానాలు జరపడం మన పట్టణప్రతిష్టకి ఎంత కళంకం ?–నేను ఒక్కణ్ణే ఆ ప్రతిష్టకి ఎక్కడ లోపం జరుగుతుందోనని అన్నహారాలు మానేసి ఎన్ని సన్మా నాలు చెయ్యలేదు!—వెంకట్రావు గారికి వెయ్యి నూటపదహార్లు ఇప్పించాను. కమలాదేవికి కనకాభి షేకం చేశాను. చివరికి ఆంజనేయులుగారికి కూడా– ఎదీ?—దండకడియం తొడిగించేశాను !

వాణీ : నేనొక్కమాట చెబుతాను, వింటారా ?

శంక : (ఆనందంగా) చెప్పండి !—

వాణీ : అందించిన వస్తువుల వెలబట్టి కాదండీ, సన్మానంలోని విశిష్టత కొలవడం—ఆదరిస్తున్న హృదయాల్నిబట్టి !

శంక : మీరింత మరీ సత్యకాలపు మనిషయిపోతే ఎల్లాగండీ, కవిగారూ ? మీరల్లా ఊరుకోండి. ఎదీ?—ఖంగు ఖంగుమనే ఘనసన్మానం నేను చేస్తాను, చూద్దురు గాని !

వాణీ : పట్టణం తరపుని ఓ సన్మానం ఈరోజునే అయిందిగా ? మళ్ళీ ఎందుకూ ?

శంక : అబ్బా, దాన్ని సన్మానం అనకండి. సిసలైన సన్మానం సవ్యంగా సొంతంగా నేను మీకు జరిపించి వాళ్ళకి బుద్ధొచ్చేలా చేస్తాను. ఛైర్మన్ జనతారావు ఎదీ?— గొల్లుమని ఏడవాలి !

వాణీ : అంటే మీ ఇద్దరిమధ్యా రగులుకొంటున్న ఆంతరంగిక ద్వేషాల్ని తీర్చుగుందుకు నన్ను ఉపయోగించు కుంటారన్నమాట !—దయచేసి నాకు వొద్దండి !

శంక : అదేంమాటండీ ? మాకు మీ ఎడల గల భక్తివిశ్వాసాలు ప్రకటించుగుంటాం. వీల్లేక పోడానికి మేమేం పాపం చేశాం ?

వాణీ : మీరల్లా అంటే నేనేం చెప్పగలను ?

శంక : మీరేమీ చెప్పద్దు ! ఈవాళ్నించి పదిహేనురోజుల లోగా పట్టణంలో బతికున్న మనిషెవడూ కనీ, వినీ ఎరుగనంత సన్మానం మీకు జరిపించి—ఎదీ ?—

వెయ్యినూటపదహార్లు పళ్ళెంలో పెట్టి మీకు అంది స్తాను. ఊ, అనండి !

వాణీ : ఎందుకు మీకంత శ్రమ ?

శంక : శ్రమేముందండీ ?—ఒకరికొకరు—ఎదీ ?—సహాయం చేసుకోడం; అంతే !–Cooperative Systemఅండీ ?– తమకి తెలియదా, అల్లాచూస్తున్నారూ ?

వాణీ : (తెల్లబోయి) తెలియదండీ !

శంక : సరిపోయింది !—మీకు అపూర్వమైన సన్మానం చేస్తున్నామని పేపర్లలోను, గోడలమీదా ఘోషిత్తిం చేస్తాను. కట్టుబట్టలు విప్పకుండా, ఇంటిమొహంచూడ కుండా సన్మానభారం యీవత్తూ—ఎదీ ?—నాభుజ స్కంధాలమీద పెట్టుగుని అందర్నీ కలుసుగుని, తిట్టినా త్రోసినా వదలకుండా పట్టుగుని, కురుపుసలిపి నట్టు సలిపి డబ్బు వసూలుచేస్తాను—పోతే ! మీకు వెయ్యినూటపదహార్లు సమర్పించడం ఖాయం !— కాని !—

వాణీ : కాని !—

శంక : (చిరునవ్వుతో) మిగతా డబ్బుగురించినైనా తమరు అడక్కూడదు—ఎకౌంట్లుగురించి అసలు మాట్లాడ కూడదు ! అంతే నే కోరేది !

వాణీ : (దెబ్బతిన్నట్టుచూస్తూ) శంకరయ్యగారూ !—(ఆవే శంతో) మీరు ఇక్కణ్ణుంచి వెళ్ళిపొండి !

శంక : (తెల్లబోయి) ఏమిటీ ?

వాణీ : చెబుతున్నానుగా ?—దయిచేసి వెళ్ళండి !

శంక : (తలపంకించి) ఆలోచించుకోండి, ఫరవాలేదు !—డబ్బుగురించిన సంశయం మీకేమీ అక్కర్లేదు. పువ్వుల్లోపెట్టి అప్పజెపుతాను. నేనెంత నమ్మకస్తుణ్ణో కావలిస్తే వెంకట్రావుగారినీ, కమలాదేవిగారినీ, ఆంజనేయులు గారినీ—

వాణీ : నే నెవ్వరినీ అడగను !—ఈవిషయం అసలు ఆలోచించను !—మీ రింకెప్పుడూ ఈ ప్రస్తావన నాదగ్గర తేవద్దు !

శంక : తొందరపడుతున్నారు, కవిగారూ!–ఊహామండలంలో ఊరేగకండి–ఎదీ?–నేలమీద నిలబడి ప్రత్యక్ష పరిస్థితులు గమనించండి. కోరివస్తున్న సిరికి మోకాలడ్డడం మూర్ఖత్వం !

వాణీ : మానవుడి జీవితానికి పరమావధి–సిరిసంపదలు కాదు, శంకరయ్యా !—మానుషత్వం ! నీచమూ తుచ్ఛమూ అయిన మార్గాలలో ఆ సిరిసంపదలకోసం పాకులాడడం అధమత్వం ! అవసరమైతే అంతకన్నా చిరిగిన నా బట్టలే కప్పుకుని, చెదిరిన నా మెతుకులే ఏరుకు తింటాను. (R. F. లో తెల్లబోయి నుంచున్న జానకి బాధగా భయంగా "ఏమండీ !" అంటూవచ్చి ఆవేశపూరితుడైన వాణీనాథాన్ని పట్టుకుంటుంది)—పిడి

కెడు మెతుగులు చాలని ముష్టెత్తుగుంటాను. ముష్టి పొరక్కపోతే పస్తులుంటాను. పస్తులుండలేకపోతే ఏరోడ్డుపక్కనో పడి, చచ్చి, కుళ్ళి, మట్టిలో కలుస్తానుగాని, శంకరయ్యా!-జల్తారు బతుకుకోసం నా కవితామతల్లిని ఏ క్షుద్రుడి చేతుల్లోనూ పెట్టి చిత్రవధ చేయించను-వెళ్ళు!- (R. F. కేసి భార్యతో నడుస్తాడు.)

శంక : హు!-ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ. దరిద్రంలో కొట్టుగు పోతున్నారుగదా అని జాలిపడి సాయం చెయ్యడానికి వచ్చాను. అదే ఖావుందంటే-ఎదీ?-మధ్య నా కేమభ్యంతరం? సరేగాని, మహాకవిగారూ!-తమరు బాకీ పడిన మూడునెలల అద్దీ వెంటనే చెల్లించండి! లేకపోతే మర్యాద దక్కదు!

జాన——అంతమాటెందుకండి, శంకరయ్యగారూ?

శంక : అంతస్తులు గుర్తుకు తెచ్చుగోడానికి!-

వాణీ : అవుచ్చుగుని వేళ్ళాడేవాళ్ళకి గాని వాటిగుర్తులు తెలియవు. మీడబ్బు అణాపైసల్తో రేపు ఉదయం ఇచ్చేస్తానుగాని ప్రస్తుతం వెళ్ళండి.

శంక : అదీచూస్తాను!-మూడునెలల అద్దీ ఏభై మూడాయలు!

[మురారి L F. లోంచి తూలుకుంటూ లోపలికొస్తాడు. వొంటిమీద వేళ్ళాడుతున్నట్టున్న లాల్చీ పంచ మాసిపోయి ఉంటాయి, మాసిన గెడ్డం,

చెదిరిన జుట్టు అందని లోతుల్లో అతుక్కుపోయినట్టు కనపడే నిష్ప్రకణాలాంటి కళ్ళు. పాలిపోయిన మొహం. చేతులూ కాళ్ళూ పట్లున్నట్లు వ్యవహరించవు. అదుపు తప్పిన ఆయాసం బాగా కనిపిస్తుంది.]

మురా: ఏమిటూ ఏళ్లై ?

శంక : (వెనక్కితిరిగి చూసి, హడలిపోయి) నమస్కార మండి, మురారిగారు !

మురా: నమస్కారం !—(తీక్షణంగా చూస్తూ) ఎవరు, నువ్వు?

శంక : (తడబడుతూ) నే—నేనేనండి—శంకరయ్యని !

మురా: (కొద్దిగాతూలి) ఏ శంకరయ్య ?

శంక : (బిగుసుకుపోయి, వాణీనాథంతో) చెప్పండీ !—

వాణీ : గంపశంకరయ్యగారు !—మనయింటియజమాని.

మురా: ఒహో, వారా ?—ఏం, ఇల్లాదయచేశారు ?

శంక : (కొద్దిగా, నవ్వి) అబ్బే–! అద్దెకోసం వచ్చానండి !

మురా: అద్దెకోసం మీరు రావాల్టండీ ?—కాకిచేత కబురంపిస్తే మళ్ళీ కాకిచేత పంపించెయ్యమూ ?

జాన : అదికాదు బావగారూ ! వచ్చేడబ్బులో వాటాఇస్తే, మీ తమ్ముడుగారికి సన్మానంచేస్తానని చెప్పడానికి వచ్చారు ?

మురా: (చిరునవ్వుతో) అదివిని తమ్ముడుగారు ఈయన్ని అవతలకి పొమ్మన్నారు. దాంతో ఆయన అద్దె బాకీ అంతా ఇచ్చెయ్య మన్నారు, అంతేనా ?

జాన : అంతేనండి !

మురా: ఎప్పుడు తెలుసుకుంటావురా, ఈ ప్రపంచకాన్ని !— క్షమించండి, శంకరయ్యగారు !—మా తమ్ముడికి ఇంకా జ్ఞానోదయం అవలేదు ! (అంటూ దగ్గుతూ, గుండెల్ని గట్టిగా నొక్కి—పట్టుగుని బాధపడతాడు.)

వాణీ : జానకీ, పక్క—వెయి ! (జానకి M B. వైపు తిరుగుతుంది. వాణీనాథం మురారిని పట్టుకుంటాడు ) నువ్వు లోపలికి రా, అన్నయ్యా !—పడుక్కు—ందుగాని.

శంక : అవును, విశ్రమించండి, మురారిగారు !—పొద్దున్నే వస్తా !—

మురా: (వాణీనాథాన్ని తప్పించుకుంటూ) నువ్వుండరా !— వచ్చినవారు మహాజ్ఞానులు !—వారి సంగతేదో పూర్తిగా కనుక్కు—ని అప్పుడు పంపించాలి. (అతివినయంగా కుర్చీ చూపెడుతూ) కూచోండి, శంకరయ్య గారు !

శంక : (అనుమానిస్తూ) నా—నాకు పని ఉన్నట్టుందండి !—

మురా: (కోపంగా) కూచోమంటూంటే !—

శంక : (హడలిపోయి, కూచుంటూ) చిత్తం !—

మురా: అయితే తమది సన్మానాల వ్యాపారమా ?

శంక : అబ్బే, నాకుఇళ్ళూ, పొలమూ ఉన్నాయి !—

మురా: అబ్బా, అంతలాభం వచ్చిందీ ?

శంక :అబ్బెబ్బే, మాతాత లిచ్చింది !—కాని కవులూ కళా కారులూ అంటే నాకు మతిపోతుంది. వారికి ఏదో విధంగా సేవచేద్దామని ఉత్సాహం కలగచేద్దామనీ— ఎదీ ?—ఖర్చులుమాత్రం మినహాయించుగుని, యధా శక్తి కళారాధన చేస్తూంటాను.

మురా: బావుంది !—(గట్టిగానవ్వి) తమ్ముడూ ! (చెయ్యెత్తి, తెల్లబోయిన శంకరయ్యని చూపిస్తూ) కళారాధ కుడు !—మన దేశంలో చాలామంది గౌరవనీయులికి ఇదే ఉద్యోగం !—దానికేంగాని శంకరయ్యగారూ!– వొద్దని పరుగెత్తేవాడికెందుకండీ, సన్మానం ? చూడండీ !—నాతో సమానంగా బుడ్డిదింపకుండా తాగేవాడు ఈ తెలుగ్గడ్డమీద లేడు ! పోనీ నాకు చేయించండి, సన్మానం !—వచ్చిందంతా మీరే తీసుగోండి !—ఆ ?

శంక : (వెఱ్ఱిమొహంతో చూసి, కొద్దిగానవ్వి) చిత్తం !— ఆలోచించి మనవి చేస్తానండి !

మురా: ఏం ?—ఇంకా ఉందేమిటి మీ గేంగు ?

శంక : (కంగారుగాలేచి) అన్నట్టు, అర్జంటుపని జ్ఞాపకం వచ్చి నట్టుందండి. మళ్ళీవస్తాను.

మురా: చిత్తం !—మరి ఏబై రూపాయలంటున్నా రేమిటి ?

శంక : అదాండి !—తమ్ముడుగారు మాకు మూడునెలల అద్దెబాకీ అండి !

వాణీ : అణాపైసల్తో రేపు ఇస్తానన్నానుగా ?—వెళ్ళండి !

మురా: పోనీ ఓపని చెయ్యండి !—వొందరూపాయల నోటు చిల్లరుందా, మరీ ? (అని జేబులో చెయ్యపెడతాడు)

శంక : (ఆశగా) చిత్తం ! అదేమి చిత్రమోగాని సరిగ్గా ఏభై ఉన్నాయండి. (అని మరోవైపుకి తిరిగి నోట్లుతీసి లెక్కడతాడు.)

వాణి : (తెల్లబోయి) అన్నయ్యా !

మురా: ఫరవాలేదురా.

శంక : (ఆనందంతో అందిస్తూ) ఇవుగోనండి, మిగతా ఏభై.

మురా: (వాణీనాధంతో) పెద్దమనుషులు కదురా !—అనుమానించకపోతే బాధపడతారు !— (శంకరయ్యతో) సరిగ్గా ఏభై ఉన్నాయాండి ?

శంక : (నాలిక కొరికి, నవ్వుతూ) అహా, ఎంతమాట!— సరిగ్గా ఏభై ఉన్నాయండి !

మురా: సరే!—రేపు ఉదయమే వచ్చెయ్యండి. సరిగ్గా వొందిచ్చేస్తాను ! (అని నోట్లు జేబులోపెట్టుగుని M. B. కేసి తిరుగుతాడు.)

శంక : (మతోయినట్టుచూస్తూ) ఇదేమిటీ ? — అబ్బెబ్బే ! అదేంవీల్లేదండి. ముందునా ఏభై నాకిచ్చెయ్యండి !

మురా : పోనీ నాకుచేసేసన్మానంలో మినహాయించుగోండి.

**శంక : కవిగారూ ! — ఏమిటీమోసం ? — నాడబ్బునాకు ఇచ్చెయ్యకపోతే మర్యాద దక్కదు, జాగ్రత్త !**

వాణీ : అన్నయ్యా !—ఆయనడబ్బిచ్చెయి !

మురా : (M B. కేసి నడుస్తూ) పక్కవేశావా, జానకీ !

శంక : వాణీనాథంగారూ !

వాణీ : (ఆవేశంతో వెళ్ళి, మురారిని విసురుగా వెనక్కిత్రిప్పి) నీకేచెబుతున్నాను, ముందాడబ్బిచ్చెయి ! (జానకి M. B. దగ్గర్నుంచి బాధపడిపోతూవచ్చి, వాణీనాథాన్ని వారించడానికి ప్రయత్నిస్తుంది.)

జాన : (బతిమాలుతున్నట్టు) ఏమండీ !—

మురా : నేనదో ధనార్జనచేస్తూంటే వద్దంటావేమిట్రా ?

వాణీ : (జానకినితప్పించుగుని) ఇదాధనార్జన ? పరాయివాళ్ళయితే మోసంచేసి డబ్బులాక్కోడం, ఆ ప్తులైతే సందుచూసి దొంగతనం చేయడమూనా నీపద్ధతి ? మాట్టాడ్డానికి మళ్ళీమనసెల్లావచ్చిందో !— నువ్వు నాబల్లమీాంచి నేర్పుగా దొంగతనంచేసి తుచ్ఛమైన తాగుడుకోసంతగలేసిన ఆ అయిదురూపాయలూ— నాకెంతవిలువయినవో తెలుసా, నీకు ?

మురా : (బాధగా) తెలుసురా ! అమ్మాయికిమందూ, ఇంట్లోకిబియ్యం ముఖ్యమని తెలుసు. కాని, గుండెల్లో నెప్పి విపరీతమయిపోయింది.—ఆయమబాధ భరించలేకపోయానురా !

వాణీ : అందుకని— దొంగతనంచేస్తావా ? — అంతకన్నా గోదావరిలోపడితే నయంకదూ ?

జాన : (కుమిలిపోతూ) ఏమిటండామాటలు ?

మురా : (వాడికళ్ళతో తమ్ముడికేసి నిశ్చలంగాచూస్తూ) "you too! Brutvs !—" (అనికొద్దిగానవ్వి ఆగి విపరీతంగా నవ్వేస్తాడు. ఆనవ్వులో దగ్గుముంచు కొస్తుంది, వెనక్కి-తిరిగి జేబురుమాలు నోటికిఅడ్డం పెట్టుగుని మూలుగుతాడు.)

వాణీ : (ఆవేదనతో పరుగులోవచ్చి, మురారినిచేరి) నా ఉద్దేశం అదికాదు—అదికాదన్నయ్యా ! — ఆవే శంలో తెలియకవాగాను. నన్నుక్షమించు ! (అని రెండుచేతులూ పట్టుగుంటాడు.)

మురా: (చిరునవ్వుతో తల ఊపుతూ) బాగుందిరా, నీ పరి హాసం !-దారి చూపెట్టవలిసింది పోయి, అగాధంలో అలుక్కు-పోతున్న నేను, వెన్నెల్లో విహరిస్తున్న నిన్ను, క్షమించనా ? హు !-పక్క-వేశావా, జానకీ !

జాన : వేశానండి !

శంక : (ఆదుర్దాగా) మరి నా ఏభయ్యో !

మురా: ఎవరు ?-శంకరయ్యగారా?-ఏం, ఇల్లా దయచేశారు ?

శంక : (హడిలిపోయి) అయ్యో, అయ్యో !-నాదగ్గర తీసు గున్న ఆ ఏభై రూపాయలూ ఇల్లా తగలెయ్యండి. మీకు దణ్ణం పెడతాను !

మురా: నాకే!-దణ్ణమే !

శంక : (నిరాశతో) ఆ !—

మురా: ఏదీ పెట్టు! (శంకరయ్య రెండుచేతులూ జోడించి దణ్ణం పెడతాడు. మురారి నవ్వి) జేబులు ఖాళీచేస్తే ఎంత డబ్బాలు కొట్టే లక్షాధికారేనా చూపెట్టే అసలురంగు ఇదే!–నమస్కారం!–(డబ్బిచ్చేసి) ఇంక తమరు వెళ్ళచ్చు!

[శంకరయ్య ఆడబ్బు లెక్కెట్టుగుని తక్షణం వెళ్ళి పోతాడు.]

వాణీ: జానకీ!–వీధి తలుపు గడియవెయ్యి! (జానకి వేస్తుంది) అన్నయ్యా!–ఆ కుర్చీలో కూచో!

మురా: వొద్దురా!–వెళ్ళి పడుక్కుంటాను. మంచి కలలేనా వస్తాయి!

వాణీ: ఒక్క నిమిషం, అన్నయ్యా!

మురా: ఏమిట్రా, అది? (అని కుర్చీదగ్గరకు వచ్చి కూచుంటాడు.)

వాణీ: అన్నయ్యా!–ఈ విశాలప్రపంచంలో నాకు మిగిలిన పెద్దదిక్కు నువ్వొక్కడివే!–నువ్వు ఎదురుగుండా ఉంటేచాలు నాకు బోల్డు ధైర్యంగా ఉంటుంది. అనుభవంలేని వాణ్ణయినా, అభాగ్యుణ్ణయినా నీఅండ చూసుగునే, ఈ జీవితాన్ని గెంటుకొస్తున్నాను—అర్ధాంతరంగా ఇప్పుడు నన్ను అన్యాయం చేసేస్తావా, అన్నయ్యా!–(అంటూ కుమిలిపోతాడు.)

మురా: ఏంచేశానురా?

వాణీ : ఇంకా ఏంచెయ్యాలి ? నీ ఆరోగ్యం ఏమీ బాగుండ లేదని నీకు తెలుసు—తాగుడే నిన్ని దారుణస్థితికి ఈడ్చుకొచ్చిందనీ తెలుసు ! మళ్ళీ ఎందుకు తాగుడు మొదలెట్టావు, అన్నయ్యా !

మురా: (సూన్యంలోకి చూస్తూ) తాగుతే మరణం ! తాగక పోతే నరకం ! ఏది సుఖంరా? తాగుడు ఆలస్యమయితే ఇప్పుడు శరీరం సత్యాగ్రహంచేస్తోందిరా. మొద ఖలో హోరు —గుండెల్లోపోటు — నరాల్లోరగిలే దావానలం—శరీరాన్ని మెలికలుతిప్పేస్తుందిరా ! ఆ దారుణనరకం బతిగున్నవాడెవడూ భరించలేడురా! (లాభంలేదన్నట్టునిట్టూర్చి) ఏమైనా తాగుడేశరణ్యం !

జాన : ఫలితం తెలిసుండికూడా నాశనాన్ని కోరితెచ్చు గుంటామా ?—దీనికి మరోదారిలేదా ?

వాణీ : అసలు నువ్వెందుకు తాగుడుమొదలెట్టావు ?

మురా : నేనా ?—(చిరునవ్వుతో) తాగడానికి !

వాణీ : ఎన్నిసార్లడిగినా ఇల్లాగే తప్పించుకుంటున్నావు.— ఏకారణంలేకుండా ఎవ్వరూ తాగుడికిలొంగిపోరు. ఏదోప్రబలకారణం ఉంటేనేతప్ప నీవంటి ప్రాజ్ఞుడూ, విద్యావంతుడూ అసలులొంగడు. (ఆవేశంతో) నా మీద వొట్టేసి చెప్పన్నయ్యా ! (బాధపడిపోతూ) ఎందుకు—ఎందుకు నువ్వు తాగడం మొదలెట్టా వన్నయ్యా ! (అంటూ దుఃఖంఆపుకోలేక ఘుర్ఘారి

కుర్చీపక్కని మోకాళ్ళమీద కూర్చుండిపోయి, మురారిఒడిలో తలదాచుగుని ఏడ్చేస్తాడు.)

మురా : (తమ్ముడి విచారానికి తట్టుగోలేనంత బాధ పడుతూ, నిరాశచిమ్ముతున్న చిరునవ్వుతో తమ్ముడి భుజంమీద ప్రేమతో తట్టుతూ) పాడునిచ్చెనమీంచి, హాయిగా వెల్లకిత్తులా పడ్డవాణ్ణి—ఒక్కేసి మళ్ళీ మెట్లెక్కించకురా! —అదంతా ఓపీడకల! (అని బాధపడుతూ, చిరాగ్గా కళ్లుమూసుగుని తలవంచేసు గుంటాడు. క్షణమాగి మెల్లిగా తలెత్తుతాడు, మురారి. ఏవో విపరీతస్మృతుల సుడిగుండాల్లో తిరిగి పోతున్నట్టు ఆవేశంతో లేస్తాడు.) అదుగో!—అదుగో వినరా ఆ చప్పట్లు!—ఆధ్వని తరంగాలే కదురా ఆకలిగొన్న కళాజీవికి పంచభక్ష్య పరమాణ్ణాలు!— ఆ ఉత్సాహ ప్రకటనే కదురా కళాకారుణ్ణి వెఱ్ఱెత్తించేసే ఏకైక సంఘటన! (రోషంతో) వాటి ముందు కరిగిపోకుండా ఎల్లాగరా నిలబడటం?..... M A. చదువుతూ కాలేజీలో మొదటిసారి నేను నాటకమాడినపుడు ఈచప్పట్లే, ఈ ఉత్సాహమే నన్ను ఆకాశానికి ఎత్తేశాయి! ఆంధ్రనాటకరంగంలో నూతనతార వెలిసిందన్నారు. మళ్ళీఆడాలిరా—, మళ్ళీఆడాను! — శుష్కించిపోతున్న నాటకకళకి నానటన అమృతమన్నారు!— అడ్డూ,

అదుపూ లేకుండా నాటకరంగంలో లీనమైపోయాను—పరిషత్తులకెళ్ళమని ప్రోత్సహించారు. వెళ్ళాను! వెళ్ళినచోటకల్లా వెంటాడాయిరా, ఈచప్పట్లు!—అన్నిపరిషత్తులలోనూ ఉత్తమనటుడూ, ఉత్తమ నటుడూ అన్నారు!—ఇంకేంఉంది? 'కళాదేవికి ముద్దు బిడ్డా! కళోద్ధరణకి నడుం కట్టోయి,' అని నామీద పద్యాలుకూడా రాశారు!—నాకు మత్తెక్కి—పోయింది. అచంచలమైన మనస్సుతో, అకుంఠిత దీక్షతో అహోరాత్రాలు మైమరచి కళాసేవ చేశాను. ఒహో, అన్నారు!—బిరుదులిచ్చారు!—సన్మానాలు చేశారు!... M. A. పోయింది—వాళ్ళు పొగరన్నారు!—నాటకమాడితే పనిలేని వాడన్నారు!—ఏం ఖర్చుపెడుతున్నావు అని అడక్కుండా డబ్బిచ్చేనాన్న చచ్చిపోయాడు!—డబ్బులేక రోడ్డుమీద నిలబడ్డాను. నాటకాపేక్షమాత్రం పోలే!—చివరికి మొహానికి రంగు కొనుక్కోడానికి చెయ్యి జాపితే—తమ్ముడూ!—చప్పట్లు కొట్టిన ఆ చేతుల్లోంచి రాగికానీకూడా రాల్లేదురా!—చదువు తగలేసుకున్న చవటన్నారు! గారడీరా ఆచప్పట్లు!—ఎండమావుల్లా ఆ నిండు నవ్వులు!—నువ్వేనా భ్రమపడి దగ్గిరకెళ్ళకు!—వెడితే నాలాగే మాడిపోతావు. మాడిపోతావురా మసి అయిపోతావు!—జాగ్రత్త! (అని గర్జించి, దగ్గుకుంటూ

తూలుకుంటూ, M. B లోకి విసురుగా వెళ్ళి పోతాడు.)

వాణీ : (నీళ్ళు నిండిన కళ్ళతో) ఆవేశంలో అన్నయ్య ప్రజల్నే అపార్థం చేసుగున్నాడు! (బరువుగా నిట్టూర్చి) ఆంధ్రప్రజలు అతి విశిష్టమైన కళాభిమానులు, జానకీ!

జాన : ఇంతకీ మన దురదృష్టం! (అని పమిటచెంగుతో కళ్ళు తుడుచుగుంటూ R. F. లోకి వెళ్ళిపోతుంది. వాణీ నాథం M. B. లోకి వెడతాడు. M. B లోంచి విప రీతమయిన దగ్గు, మూలుగు వినిపిస్తుంది.)

వాణీ : (కంగారుగా M. B. లోంచి వస్తూ) జానకీ!—జానకీ !

జాన : (R. F. లోంచి వస్తూ, భయంగా) ఏమిటండీ? ఏమయిందండీ ?

వాణీ : ఏంలేదు ! (M. B. లోకి వెళ్ళబోతున్న జానకిని వారిస్తూ) నువ్వు లోపలికి వెళ్ళకు !

జాన : (ఆదుర్దాగా) ఆ!—మళ్ళీ నెత్తురు కక్కు—గున్నారా?

వాణీ : అవును!—ముందు కాసిని వేన్నీళ్ళు పెట్టు !

[జానకి తొందరగా R. F. లోకి వెళ్ళబోతుంది. వాణీనాథం అలిసిపోయినట్టు నిట్టూరుస్తూ, ఏదో ఆలోచిస్తూ M. B కేసి నడుస్తూంటాడు. L. F. అవతలనుంచి తలుపుచప్పుడు గట్టిగా వినిపిస్తుంది. వాణీనాథం ఆగుతాడు. మళ్ళీ తలుపు చప్పుడవు తుంది.]

ఎవరది? (అంటూ L. F. కేసి విసుగుతో వెళ్ళి తలుపుతీస్తాడు. L. F. లోంచి జగన్నాథం ప్రవేశిస్తాడు) మీరా. మామగారూ!—రండి!—సామానేదీ?

జగ : రిక్షావాడు తెస్తున్నాడు.

వాణీ : వాడెందుకు? నేను తెస్తానుండండి!—(అని L. F. లోకి వెళ్ళి ఒకహోల్డాలు, మరచెంబు తీసుకుని వస్తాడు. ఈలోగా జగన్నాథం ఆగదిఅంతా నిశ్చలంగా చూస్తూఉంటాడు. సామాను తెచ్చి R. F. దగ్గరలోని గోడప్రాంతాల్లో ఉంచుతాడు.) అల్లా కూర్చోండి, మామగారూ!

జగ : ఊఁ! (కూంచుని) అంతాకులాసాగా ఉన్నారా?

వాణీ : ఏదో ఉన్నామండి! (M. B. లోంచి దగ్గువిని పిస్తుంది.) ఆ!—ఇప్పుడేవస్తానండి! —జానకీ!— మీ నాన్నగారువచ్చారు, చూడు! (అంటూ కంగారుగా M. B. లోకి వెళ్ళిపోతాడు.)

జాన : (R. F. లోంచి ఆనందంతోవచ్చి) ఏం, నాన్నా?— ఇంటిదగ్గిర అంతా కులాసాగాఉన్నారా?

జగ : (చూసి, ఆశ్చర్యపడి, నమ్మలేనట్టుబాధగా) ఇదేమిటి, తల్లీ!—ఇల్లాచిక్కిపోయావేం?

జాన : ఏంలేదు, నాన్నా!—

జగ : వాంట్లో బాగుండలేదా?

జాన: బాగానేవుంది !—

జగ : మరి ?—

జాన : (తొట్రుపాటుతోనవ్వి) కాళ్ళుకడుక్కుందుకు నీళ్ళు తెస్తాను, నాన్నా !— (అని తిరిగి R. F లోకి వెళ్ళి పోతుంది. జగన్నాథం గోడలమీదఉన్న సన్మాన పటాలన్నిటికేసీ తీరికగాచూస్తూంటాడు, R. F. లోంచి. జానకి చెంబుతో నీళ్ళుతెచ్చి, L. F. లో పెడుతుంది.)

జగ : నగలేమీ పెట్టుగోలేదేమే, జానకీ !

జాన : అవా ?!—ఇంట్లో ఎందుకని !

జగ : బాగుంది. ఆగోడలమీదవన్నీ ఏమిటమ్మా ?

జాన : అవా ? —ఆయనరాసిన కవిత్వాన్ని మెచ్చుగుంటూ అనేకఊళ్ళవాళ్లు ఇచ్చిన సన్మానపత్రాలు, నాన్నా !

జగ : అల్లానా !—అయితే అల్లుడు చాలాపేరు సంపాందించాడన్నమాట !

జాన : అవును, నాన్నా !

జగ : అంతేనా ?—అల్లుడికిం కేమయినా ఆదాయండుందా ?

జాన : అవేం మాటలు, నాన్నా ?—ఆయన వింటారు !

జగ : (చిరకోపంతో) అంతేలే ! (అనిL. F. లోకి వెళ్ళి పోతాడు. జానకికళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. M. B లోంచి వాణీనాథం తలవంచుగుని వస్తాడు.)

జాన : (కంగారుగా, బాధగా) ఏమండీ ?

వాణీ : ఊఁ ?

జాన : ఇప్పుడెల్లా ?

వాణీ : ఏమిటి ఎల్లా ?

జాన : నాన్న వచ్చాడు కదండీ ?

వాణీ : అవును !

జాన : (గద్గద కంఠంగా) అవునేమిటండీ ?—భోజనం !

వాణీ : (కంగారుగా) మరే !—భోజనం ! !—ఎల్లా ?

జాన : పోనీ అల్లా వీధులోకెళ్ళి తొందరగా నాలుగు అరిటి పళ్ళూ అవీ పట్రండి !

వాణీ : సరే ! (అని వెనక్కి తిరిగి దండెంమీద కండువా భుజంమీద వేసుగుంటాడు. జగన్నాథం L. F. లోంచి వస్తాడు. జానకి చెంబుతీసుగుని R. F. లో పెట్టి వచ్చేస్తుంది. వాణీనాథం దండెంమీదనుంచి ఓ తువ్వాలు తీసి) కాళ్ళుతుడుచుగోండి. మామగారూ!

జగ : (కాళ్ళుతుడుచుగుందుకు, తువ్వాలు తీసుగుని, కుర్చీలో కూచుంటూ) ఇప్పుడు కండువా వేశావేమిటోయి ?

వాణీ : అదేనండి !—(అని జానకివైపు చూస్తాడు.)

జాన : ఆ, నీకు శనివారం గదా అని నాలుగు అరటిపళ్ళూ అవీ తెస్తానన్నారు !

జగ : ఏమీ వద్దమ్మా !—శక్తిలేక ఓ దణ్ణంపెట్టి శని వారాలు మానుకున్నాను. ఏదోకాస్త భోజనమే చేసేస్తాను, వడ్డించెయ్యి !

[దెబ్బతిన్నట్టు వాణీనాథం, తెల్లబోయి జానకీ ఒకర్నొకరు చూసుగుంటూ నిలబడిపోతారు. కుర్చీలోంచి లేస్తున్న జగన్నాథం M. B. గుమ్మంలో నిలబడ్డ మురారి స్వరూపంచూసి తెల్లబోతాడు.]

అత నెవరు, వాణీనాథం ?

వాణీ : మా అన్నయ్యండి !

జగ : మీ అన్నయ్యా ?

వాణీ : మ రేనండి !—మురారి !

జగ : (నమ్మలేనట్టు) మురారా ?—మురారి ఆమధ్య ఆసుపత్రిలో—

మురా : పోయాడన్నారు, కదూ ?—లేదండి ! —డాక్టర్లకి ఫీజులు. ఫలహారాలు ఇచ్చుగోడానికి మనదగ్గిర డబ్బేంలేదుగా ?—అంచేత, చంపడానికి వీల్లేదు, ఇంటికి పొమ్మన్నారు !

జగ : బాగుంది. ఇక్కడకొచ్చి ఎన్నాళ్ళయింది ?

జాన : నాలుగురోజులే, నాన్నా!—

మురా: మరో ఆరురోజు లుంటాను.

జగ : బాగుంది, ఉండునాయనా!—నువ్వు నడమ్మాయి !

(అని R. F కేసీ చూపెట్టి ఓ అడుగువేస్తాడు.)

జాన : (బాధతో, సిగ్గుతో కుమిలిపోతూ) నాన్నా!—(అని వాణీనాథంకేసి Desperate గా చూస్తుంది.)

వాణీ : మామగారు!—(అని మాటల్ని మించిన ఆవేదనతో బరువుగా తల దించుకుంటాడు.)

జగ : ఏమిటి సందేహిస్తున్నారు ?

మురా: ఆ. ఏంలేదు!—మీకు భోజనం పెట్టడం ఎల్లాగా, అని !—

జగ : (ఆశ్చర్యంగా) ఏం ?

మురా: మాకు మైలండి !

జగ : (తెల్లబోయి, వెనక్కి ఓ అడుగేసి) అల్లానా!–ఎవరు పోయారు ?

మురా: పోయినవా డెవడైతేం?—వచ్చింది, మైల !

వాణీ : (విపరీతంగా బాధపడిపోతూ) ఎందుకన్నయ్యా, అబద్ధమాడతావు? అప్పులతో అబద్ధమాడ్డంకన్నా ఆత్మవంచన లేదు. మమ్మల్ని క్షమించండి, మామ గారూ!–ఇంటికివచ్చిన అతిథి శ్రేష్ఠుణ్ణి ఆదరించి భోజన సదుపాయమైనా చెయ్యలేని అభాగ్యుణ్ణి అయ్యాను. నాఅంత పాపిష్టివాడు మరొకడుండడు!–(జానకి అభిమానంతో కళ్ళనీళ్ళు కారుస్తూ నిలబడిపోతుంది.)

జగ : మైలంటూ వేమిటయ్యా, మరీనూ!–ఈ ఒడుదుడుకులు సంసారాల్లో సామాన్యమే. అనవసరంగా, బాధ పడ క్కండి !

వాణీ : అరిటిపళ్ళు తెస్తానండి !-

జగ : కడుపు నిండుగాఉంది, నాయనా!-ఏమీవద్దు!-కాని, వాణీనాథం!-నన్నొకమాట చెప్పమంటావా ?

వాణీ : చెప్పండి. మామగారూ !

జగ : ఇప్పటికే నీకు అర్థమయిఉంటుందనుకుంటాను. మన దేశంలో కళలకీ, కవిత్వానికీ మాటవిలువ తప్పించి, డబ్బు విలువలేదు. కాని ఈ ప్రపంచంలో జీవితాలు మాటలతో గడవ్వు. డబ్బుతోనే నడుస్తాయి!—— అంతెందుకు?——ఎంత పండితుడైనా సరే, ఇతర ఆస్థి మరో ఆర్జనాలేకుండా పరువుగా బతికిన ఒక్క ఆధునిక తెలుగుకవిని చూపెట్టు !——ఇంకా ఎందు కయ్యా, ఈకవిత్వ పరిశోధన, కంచిగరుడసేవ !—— సుబ్బరంగా ఏదేనా ఉద్యోగం ఇప్పిస్తాను !-హాయిగా చేసుగో, అంతా కృతార్థులం అవుతాం !

మురా: మామగారూ ! మీరు అయిదేళ్ళక్రితం నాకు కన పడుంటే నా జీవితం ఇల్లా ఉండేదికాదు ! (అని బీడీ వెలిగిస్తాడు.)

వాణీ : ఏమయినా, సరే !——నారచనల మీద నాకువిశ్వాసం ఉంది.నా ప్రజలకి గౌరవం ఉంది. నాకంతేచాలు!—— ఇక భోగభాగ్యాలంటారా, అదివ్యక్తి అదృష్టంమీద ఆధారపడిఉంది అభాగ్యుడైన ఒక్కవ్యక్తినిబట్టి కవిత్వప్రయోజనాన్నే శంకించడం శుద్ధ పామరత్వం.

జగ : సరే, నాయనా!–నీ ఇష్టం!–అన్నట్టు, అమ్మాయి!–అసలుసంగతి చెప్పడం మరిచాను. మీ అమ్మకి ఈ మధ్య ఆరోగ్యం సరిగ్గా ఉండటంలేదు. నిన్నొకసారి తీసుకు రమ్మంది.

జాన : (ఆదుర్దాగా) అమ్మకా?—ఎన్నాళ్ళనుంచీ?

జగ : చెబుతానుగాని, మనకోగంటలో బండుంది. త్వరగా సర్దుకో!—ఏమోయి, వాణీనాథం!—అమ్మాయినో సారి తీసుకెడతాను.

వాణీ : (జానకివైపు ఒకక్షణం చూసినతర్వాత) అల్లాగే నండి!—కాని నా దొక్క కోరిక.

జగ : (మంచిగా) ఏమిటది?

వాణీ : (L. F దగ్గర బల్లమీద ఉన్న కాగితాల కట్టతీసుకుని) అయిదు సంవత్సరాల అకుంఠిత కృషిఫలితం ఈగ్రంథం. ఇది నా జీవితరచన. ఇటువంటి శాశ్వత గ్రంథం నా జన్మకి మరోటిరాదేమో!—రసజ్ఞుడైన నా మిత్రులొకరు దీన్ని అచ్చువెయ్యడానికి అమితంగా ఉత్సాహపడుతున్నారు. ధనమిచ్చి, నాశ్రమనీ, నన్నూ, గౌరవించి ఈగ్రంథం తీసుకెళ్ళడానికి ఇహనో, ఇప్పుడో వచ్చేస్తారు. బహుశా, నాజీవితంలో ఈమాత్రం ధనం మళ్ళీరాదేమో!—ఈ శుభసమయంలో మీరిద్దరూ ఉండి మరీవెడితే నేను చాలా సంతోషిస్తాను!

జాన : (ఉత్సాహంతో) అవును, నాన్నా!–రేపు వెడదాం!

మురా: (బీడీకాలుస్తూ) ఈలోపల అత్తగారికి ఎక్కువై పోతే !—

వాణీ : అదేంమాట, అన్నయ్యా ! (గ్రంథం, పుస్తకాల పెల్పుమీద పెడతాడు.)

జగ : (లేచి) ఏమైనాసరే, ఈరాత్రే వెళ్ళిపోవాలి !— సర్దుకో, అమ్మాయి !

వాణీ : అదికాదు, మామగారూ !

జగ : పెళ్ళిచేసి మరొకరి చేతుల్లోపెట్టాక, కన్నకూతురైనా పరాయిపిల్లే నాయనా !—జానకి వచ్చినా రాక పోయినా నేనుమాత్రం ఈబండికి వెళ్ళితీరాలి.

వాణీ : (జానకి మనోవేదనగమనించి) జానకిని కూడా మీతోనే తీసుకువెళ్ళండి ! — బట్టలు, సర్దుకో, జానకీ !

[అని నిట్టూరుస్తాడు. జానకి బరువుగా అడుగులు వేస్తూ M. B లోకి వెడుతుంది. వాణీనాథం పుస్తకాల పెల్పుదగ్గరఉన్న గ్రంథం తియ్యబోతాడు. L F. లోంచి వాణీనాథంగారూ !—వాణీనాథంగారూ !'' అని పిలుపు విని పిస్తుంది.]

జగ : ఎవరో పిలుస్తున్నట్టున్నారోయి !

వాణీ : ఆ !—శఠగోపంగారే వచ్చుంటారు. (అని ఉత్సాహంతో L F. తలుపుతీసి, గుర్తించి) రండి, శఠగోపంగార్లూ !

శర : (వచ్చి గుమ్మంలో ఆగి) నమస్కారమండి, కవిగారూ! (వాణీనాథం ఆనందంతో ప్రతినమస్కారం చేస్తాడు.) ఆలస్యమయినట్టుంది, క్షమించాలి!

వాణీ : ఎంతమాట! — ఏమీ ఆలస్యమవలేదు. దయ చెయ్యండి! (కుర్చీ చూపిస్తాడు.)

శర : చిత్తం! (వెనక్కి తిరిగి L F లోకి చూసి) రండి!

వాణీ : ఇంకా ఎవరేనా వచ్చారా?

శంక : (L. F. లోంచి, చిరునవ్వుతో ప్రవేశిస్తూ) నేనేనండి!

వాణీ : దయచెయ్యండి!—కుర్చీ—తెస్తానుండండి!

శంక : ఎందుకండీ? ఫస్టుక్లాసయిన చిన్న బల్ల ఉందిగా?— ఎదీ?—(అంటూ డ్రాయరుకింద ఉన్న స్టూల్ తీసి) హాయిగా కూచుంటాను! — మీరుమాత్రం ఆ కుర్చీలో దయచెయ్యండి శఠగోపంగారూ!

వాణీ : దయచెయ్యండి. శఠగోపంగారూ! (శఠగోపం కుర్చీ లోనూ, శంకరయ్య స్టూలుమీద కూర్చుంటారు.) వారు, మా మామగారండి, జగన్నాథంగారు!— ఇప్పుడేవచ్చారు.

శర : అల్లానా? నమస్కారం! (నమస్కార ప్రతినమస్కారా లవుతాయి)

శంక : మా వాణీనాథంగారి మామగారా, తమరు! — చెప్పారు, కారేం? ఆ మహాపండితుణ్ణి అల్లుడుగా పొందిన మీరెంత అదృష్టవంతులండి!

వాణీ : (శఠగోపంతో) అతను, మా అన్నయ్య, మురారి !

శంక : (మురారికి నమస్కరిస్తున్న శఠగోపంతో) ఒకప్పుడు ఆంధ్రదేశాన్ని ఊపేశిన మహానటు డాయన !

శఠ : (ఆశ్చర్యంగా) ఏమిటీ?!–ఆ మురారి ఈయనేనా ?— అల్లా అయిపోయారేం ?

మురా: (నిశ్చలంగా చూస్తూ) ఏం తోచక !—

శఠ : (దెబ్బతిన్నట్టు చూసి) చిత్తం!–అన్నట్టు, కవిగారూ!– మీ గ్రంథం ఒకసారి కళ్ళారా చూడనియ్యండి !

వాణీ : ఒకసారేమిటి ?—ఇంక పూర్తిగా మీదే ! (అని పెట్టెమీద ఉన్న కాగితాలకట్ట ఆప్యాయంతో తీసి చూసుగుని శఠగోపానికి అందిస్తాడు.)

శఠ : (పుస్తకం బరువు చూసి) అబ్బో, చాలా పెద్దగ్రంథమే! పేరువిని చిన్నదనుకున్నాను !–అయిదు సంవత్సరాలు పట్టిందంటే ఆశ్చర్యమా?—జగన్నాథంగారూ!—ఈ కవిగారు చిన్నాయన గనక ఎదురుగుండా చెప్ప కూడదు కానండి, మనదేశానికి కేవలం మణిపూసండీ!

జగ : చిత్తం!—అదే నాకూ చాలా ఆనందంగా ఉంది !

శఠ : అయ్యో!—అన్నట్టు, కవిగారూ ! కార్యక్రమం సక్రమంగా సాగిద్దాం! ముందు మీ గ్రంథం మీరు తీసుగోండి ! (తిరిగి గ్రంథం వాణీనాథానికి ఇచ్చేస్తాడు.) తమకి తాంబూలం ఇచ్చుగుని ఎగ్రిమెంటుమీద సంతకాలు చేసుగుని, ఆ తరవాతే గ్రంథం గ్రహిస్తాను.

వాణీ : మీ ఇష్టమొచ్చినట్టే కానీండి. (గ్రంథం మళ్ళీ పెట్టె మీద పెడతాడు.)

శర : (చిరునవ్వుతో లేచి, తమలపాకులు బల్లమీద ఉంచి, చెక్క-పొడుం పొట్లం విప్పి తమలపాకుల్లో చెక్క పొడుంపోసి, మరో జేబులోంచి కొంత డబ్బుతీసి అందులోఉంచి, మొత్తం చేత్తో పట్టుగుని). వాణీ నాథంగారూ!—మీరు రచించిన గ్రంథం అమూల్యమైంది. దానికి వెలకట్టే ధైర్యంకాని, తాహతుగాని నాకులేదు. ఏదో శక్తి ఉన్నంతవరకూ, కష్టపడో, నష్టపడో భాషాసేవ చెయ్యడానికి సంకల్పించుగున్న వాణ్ణే గనక, చంద్రుడు కో నూలుపోగులా ఈ చిన్న మొత్తాన్ని తమకి అంద జేసుగుంటున్నాను. దయచేసి గ్రహించండి !

[అని వాణీనాథానికి ఆ తాంబూలం సవినయంగా సమర్పిస్తాడు. వాణీనాథం అందుకుని భక్తితో నమస్కరిస్తాడు. తరువాత అందులో నోట్లుతీసి లెక్కచూసుగుని, వెఱ్ఱివాడిలా శరగోపం కేసిచూసి, తమలపాకులు నేలమీదికి వదిలేసి, నిశ్చేష్టుడై నిలబడిపోతాడు.]

మురా : ఎంతరా ఆడబ్బు ?

వాణీ : (కలగంటున్నట్టుచూస్తూ) నలభై !

జగ : నలభయ్యా ?!

శర : తమరికి ఆశాభంగం కలగజేస్తే క్షమించాలి! నేను ముందేమనవిచేసుగున్నాను. ఇది పుస్తకానికి విలువ ఎంతమాత్రంకాదు. కేవలం నాశక్తికి సరిపోయింది!

మురా : (విసురుగా) అయితే, శరగోపంగారూ!—ఈమణి పూసలు చచ్చిపోయిరాయాలా, బతికిరాయాలా పుస్తకాలు?

శర : మీరంత కరుకుగా సెలవిస్తే నేనేం సమాధానం చెప్ప లేను. దేశకాలపరిస్థితులు అల్లా అఘోరిస్తూంటే మేముమాత్రం ఏంచెయ్యగలం చెప్పండి. ప్రస్తుతం మన దేశంలో ప్రతీమొదటివాడూ ఒకరాజకీయవేత్త, ప్రతీరెండోవాడూ ఓమహాకవి. కాగితాలకట్టలుచ్చు గుని, ఊరికే అచ్చేసుకోండని మా ఆఫీసులచుట్టూ తెగతిరుగుతూంటారు. పైగా వాటికి చలామణీ విపరీ తంగా ఉంది. ఇంక, భాషా, సంస్కృతీ వీటిఅభివృద్ధి కోసం రాయబడ్డపుస్తకాన్ని చూసే నాథుడుకూడా కరువవుతున్నాడు. పైపెచ్చు వీటికి పెట్టుబడికూడా పెద్దది! వ్యాపారదృష్టిలో ఈపుస్తకాలు మేము అచ్చువెయ్యటం మాకుబొత్తిగా నష్టం. కాకపోతే, ఈ పండితులమీద ఉన్న గౌరవంమూలాన్ని, భాష మీద ఉన్న అభిమానంమూలాన్ని ఎదో పాకులాడ తాం, అంతే!

జగ : అమ్మాయి!—రైలుకి టైమవుతోంది!

శఠ : వాణీనాథంగారూ !—ఇందులో బలవంతం ఏమీ లేదు !—మీ కిష్టమయితేనే తీసుగోండి !

జగ : ఈ గ్రంథానికి ఇంతకన్నా డబ్బు ఇంకెక్కడారాదా ?

మురా : ఈ దేశంలోరాదు !

శంక : పరిస్థితులండీ, పరిస్థితులు ! ప్రస్తుతం రచనకి ముద్రణ యోగమే ఒకమహాభాగ్యం. పైగా కవిగారు ఈ మహాగ్రంథాన్ని క్షుద్రమైన రూపాయలకోసం రాశా గండీ ? — ఏదీ ?– నిత్యమైన లోకకల్యాణంకోసం రాశారు. ఉదాత్తమైన వారికోరిక ఏమిటంటే, ఇది అందంగా అచ్చయి ప్రజలకిచేరాలని !—అంతేకదండి కవిగారూ !

వాణీ : (నిట్టూరుస్తూ) అవును !

శంక : అంచేత. ఇక ధరవిషయం మనమే తేల్చాలిగాని, కవిగారినే అడగడం—ఏదీ ?—ఎంతమాత్రం భావ్యం కాదు. మర్యాద అంతకన్నా కాదు. శఠగోపంగారూ! నాకు ఓ అంకె తోస్తోంది, చెప్పెయ్యమంటారా ?

శఠ : మా సాధకబాధకాలు మీకుమాత్రం కొత్తా ?— చెప్పండి !

శంక : ఏమండీ, కవిగారూ ? (వాణీనాథం నిశ్చేష్టుడై ఉంటాడు.) సరే, అయితే !—శఠగోపంగారూ !— ఖచ్చితంగా ఏభై రూపాయిలూ ఇచ్చెయ్యండి !

శఠ : (బరువుగా నిట్టూర్చి) ఊఁ !—సరే !—(జేబులోంచి మరో పదిరూపాయల నోటుతీసి) తీసుగోండి, వాణీ నాథంగారూ ! (అనిఇస్తాడు.)

(వాణీనాథం పుచ్చుగుని నమస్కరిస్తాడు. జగన్నాథం M. B. లోకి వెళ్ళిపోతాడు.)

శంక : ఎగ్రిమెంటు రాయాలా ? రాశారా ?

శర : అంకెవెయ్యడం మినహా మిగతాది పూర్తిచేసే పట్టు గొచ్చాను.

శంక : అయితే అదీ కానిచ్చెయ్యండి !

శర : (చిరునవ్వుతో ఎగ్రిమెంటు కాగితం తీసి, అంకెవేసి) కవిగారూ ! ఏభై రూపాయలూ మీకు ముట్టినట్టూ, కాపీరైటుతోసహా గ్రంధం నాకుముట్టినట్టూరాశాను చదువుకోండి ! (అని అందిస్తాడు.)

(వాణీనాథం ఎగ్రిమెంటు కాగితం తీసుగుని బల్లదగ్గరకువెళ్ళి దానిమీద ఉంచి జేబులు వెతుక్కోబోతూంటే, శంకరయ్య చిరునవ్వుతో తన పెన్ను అందివ్వబోయి, ఆపుతాడు.)

శంక : (పెన్నుకోసం చెయ్యిజాపిన వాణీనాథంతో) అన్నట్టు మళ్ళీకంగారులో మర్చిపోతాం. మీ అద్దెబాకీకి శ్రీరామ చుట్టేస్తాను—ఏదీ ?—ఆ ఏభై ఇల్లా ఇచ్చెయ్యండి ?

(వాణీనాథం శంకరయ్యకేసి ఓ క్షణం నిర్వీణ్ణుడై చూసి, ఏభై రూపాయలూ ఇచ్చేస్తాడు. శంకరయ్య పుచ్చుగుని సంతోషంతో పెన్ను ఇస్తాడు.)

వాణీ: (పెన్ను తీసుగుని) సంతకం ఎక్కడ పెట్టను ?

శర : ఇక్కడండి ! (వాణీనాథం సంతకం పెట్టినతర్వాత, శర గోపంకూడా పెడతాడు.) ఇక సాక్షి సంతకా లున్నాయి !—శంకరయ్యగారూ ! తమరు చేస్తారా ?

శంక : (వాణీనాథం బల్లమీాద పడేసిన పెన్ను తీసుగుని) నిశ్శేంపలా చేస్తాను, దానికేం ?-(అనిసంతకం చేస్తాడు) రెండో సాక్షిగా వారిని కే కేద్దాం! జగన్నాధంగారూ!

జగ : (M B లోంచి వచ్చి) ఏమండి ?

శంక : ఈ ఎగ్రిమెంటుమీాద తమరు కొంచెం సాక్షిసంతకం చెయ్యాలి !

జగ : నేను చెయ్యనండి !

శంక : అదేమిటండీ ?—

జగ : అది, అంతేనండి !

శంక : (తెల్లబోయి, నవ్వి) పోనీ మీారు చెయ్యండి, మురారి గారూ !

మురా: నేను చేస్తే చెల్లుతుందా ?

శర : ఏమీా అనుమానంలేదు, చెయ్యండి ! (అని ఎగ్రి మెంటు కాగితం ఇస్తాడు.)

శంక : ఇదుగో కలం !

మురా. అక్కర్లేదు! (అంటూ విసురుగా లేచి, పుస్తకాల పెట్టెదగ్గరకు వెళ్ళి, దానిమీంచి పెద్దచాకు ఒకటి తీసి, బొటనవ్రేలు కోసుకుని రక్తం చిమ్మిన ఆ వ్రేలుతో కాగితంమీద ముద్రవేస్తాడు.)

వాణీ : (భయభ్రాంతుడై) అన్నయ్యా!—

శంక : (నోరు తేలేసి) అదేమిటీ?—రక్తం!!

శర : (కంగారుగా) రక్తంతో పెట్టావేమిటయ్యా?—మరీ దారుణం మనిషిలా ఉన్నావు!

మురా: అవును!-రక్తమే!-అయిదుసంవత్సరాలు-ఒకే దీక్షతో అంతులేని ఆపేక్షతో-నాభాష, నాప్రజలు అని పాకులాడి, రక్తమాంసాలు ధారపోసి, మార్గదర్శకంగా శాశ్వతంగా నిలిచిపోయే గ్రంథాన్ని రాస్తే, ఆ గ్రంథాన్ని సమూలంగా ఏభై రూపాయలకి కొనేసిన ఎగ్రిమెంటుమీద సంతకాలు చెయ్యడానికి—సిరాలు కాదు, శరగోపంగారూ! ఉపయోగించవలిసింది—రక్తం!

శర : (ఆశ్చర్యంగా) ఆ!!—

శంక : ఎంతపని చేశారు!

మురా: ఆశ్చర్య మెందుకు? కళలకీ, కవిత్వానికీ ఉన్న విశిష్టతని గుర్తించుగోలేని దేశంలో ఈపని ఏమీ విపరీతం

కాదు, శంకరయ్యా!—రోడ్లో ఉన్న చెట్టుకి చెంబుడు నీళ్ళయినా పొయ్యకుండా చెట్టుకింద కూచుని, పళ్ళ కోసం రొట్టలేసే దేశంలో ఇదేమీ దారుణం కాదయ్యా!

శఠ : (చిరికోపంతో) అంటే మీ ఉద్దేశం?

మురా : (చిరునవ్వుతో) ఏం ప్రశ్న!— ఈ భూమిమీద ఉన్న జంతువులన్నింటిలోకీ మనసులు అర్థం చేసుకోలేని జాతి ఒక్క—మనుషులే!—అందుకనే, దేముడు, వాళ్ళకి మాటలుకూడా నేర్పాడు. వెళ్ళిరండి!

శంక : ఏమిటో ఆయనధోరణి ఆయనది! (తాగుబోతన్నట్టు శఠగోపానికి రహస్యంగా సంజ్ఞ చేస్తాడు.) తమరు నడవండి!

శఠ : అదిసరే!—ఇప్పుడీ కాగితం చెల్లుతుందా, అని!

మురా : వేలుముద్ర సిరాతోనే పెట్టాలని ఏ లాలో ఉందయ్యా?—శంకరయ్యగారూ! మీరూ రక్తంతోనే పెట్టండి!

శంక : (హడిలిపోయి) ఏమిటీ?— నేనా?— మీకో దణ్ణం! బాబూ, శఠగోపంగారూ! ఆ కాగితాలుచ్చుగోండి, పోదాం!

శఠ : వాణీనాథంగారూ!

వాణీ : (తొట్రుపాటుతో) ఆ ?—ఆ !-క్షమించాలి ! (అని వెనక్కి-తిరిగి పెల్ఫుమీదున్న గ్రంథాన్ని ఆవేదనతో తీసి, బరువుగానడుస్తూ, విపరీతంగా బాధపడుతూ) ఇదుగోనండి, మీగ్రంథం !—(అంటూ శఠగోపం చేతుల్లో పెడతాడు. ఒక్క-క్షణం తటపటాయించి, నీళ్ళునిండిన కళ్ళుతుడుచుగుంటూ, కళావిహీనమైన చిరునవ్వుతో) శఠగోపంగారూ !

శఠ : ఏమండీ ?

వాణీ : గ్రంథాన్ని జాగ్రత్తగా అచ్చువెయ్యండేం ?

శఠ : అయ్యో, తప్పకుండాను !—మళ్ళీదర్శనంచేస్తాం !

శంక : వస్తాను, కవిగారూ ! (శఠగోపం, శంకరయ్య నమస్క-రించి L. F. లోకి వెళ్ళిపోతారు.)

జగ : వాణీనాథం !

వాణీ : మీరైలుకి టైమయినట్టుంది, మామగారూ !

జగ : సరే, అయింది ! —అమ్మాయి ! — రా,మ్మా ! (జానకి సంచిపుచ్చుగుని M. B. లోంచి వస్తుంది.) రిక్షా కే కేసుగొస్తాను. (అని L. F. లోకి వెడతాడు)

జాన : (గద్గదస్వరంతో) మీరేమీ అధైర్యపెట్టుగోకండి !— రెండురోజుల్లో వచ్చేస్తాను !

వాణీ : అధైర్య మేమిటే వెఱ్ఱిదాన ! (దుఃఖం దిగమింగుతూ) ఋణం తీరిపోయిందిగా ?—మీ అమ్మగారికి కులాసా చూసుగుని మరీరా !

జగ : (L. F. లోంచి వచ్చి) రిక్షావచ్చింది, నడు !

జాన : వెళ్ళొస్తాను. బావగారూ !

మురా: ఊ !—మంచిది !

జాన : వస్తానండి ! (అంటూ భర్తమొహం చూడలేక, తల దించుగుని కన్నీళ్ళు తుడుచుగుంటూ L. F. లోకి వెళ్ళిపోతుంది.)

జగ : (వాణీనాథం హోల్డాలు తియ్యబోతూంటే వారించి) ఫరవాలేదు. నే తీసుగెడతానులే ! (అనిబెడ్డింగు, మర చెంబుతీసి ముందు పెట్టుగుని, జేబులోంచి కొన్ని నోట్లుతీసి, ఆవేదనతో) ఇది ఉంచు !

వాణీ : ఇదేమిటే ?—అక్కర్లేదండి !

జగ : అయినాసరే, ఉంచు! (అనిబలవంతాన చేతులో పెట్టి) నే చెప్పింది, ఆలోచించు ! (అని హోల్డాలు, మర చెంబూ తీసుగుని L. F. తోకి వెళ్ళిపోతాడు.)

[వాళ్లు వెళ్ళిన కొద్దిక్షణాలవరకూ వాణీనాథం అచేతనుడై నిలబడి, లోపల్నుంచి పొంగి పొర్లి వస్తున్న దుఃఖానికి క్రమేపీ లొంగిపోయి, పెల్ఫుమీద ఉన్నపుస్తకాల

దొంతర్ల దగ్గరికి ఆవేశంతో వెళ్ళిపోయి, అంతులేని ఆప్యాయంతో, భరించలేని ఆవేదనతో వాటినన్నిటిని కౌగలించుకుని ఏడుస్తూ, ఆ పుస్తకాలన్ని అల్లాగే తీసుకుని హాలు మధ్యకి తూలుకుంటూవచ్చి. వొళ్ళు తెలియని స్థితిలో నిలువునా కూలిపోతాడు. అనుకోని ఈ సంఘటనతో అదిరిపడిన మురారి "తమ్ముడూ!" అని వెఱ్ఱికేక వేసి, పట్టుగోడానికి అన్నట్లు చేతులుజాచి, గోడదగ్గర చిన్నబల్లమీద కూచున్న తను, కూచున్న పళంగానే, వాణీనాథంమీద విరుచుకు పడిపోతాడు.]

తెర



## రంగం - 2

[వాణీనాథం ఇంట్లో అదే హాలుగది. M. B కి R.F. కి మధ్యలో షెల్ఫుకి ఎదురుగా వేయబడిన మంచంమీద వాణీనాథం పడుక్కొనిఉంటాడు. గుండెలమీదకి దుప్పటీ కప్పబడి ఉంటుంది. అవ్యక్తమైన ధోరణిలో మూలుగుతూంటాడు. మురారి మంచి బట్టలు వేసుగుని, పరిశుభ్రంగా ఉంటాడు. పచార్లు చేస్తూ నెర్వస్‌గా బీడీ కాలుస్తూంటాడు ]

వాణీ : (దగ్గి, మెల్లిగా తలఎత్తి) అమ్మా!—అన్నయ్యా!

మురా: (పచార్లు చేస్తూనే) ఊ!—

వాణీ : (మరికొంచెం లేచి) ఏదో సామాన్యపు జ్వరమేఇది. ఎందుకంతగా ఆదుర్దా పడతావు ?

మురా: ఊ!

వాణీ : అందులో నీ ఆరోగ్యం అసలు బాగుండలేదు ?

మురా: ఊ!—

వాణీ : అన్నయ్యా!

మురా: (ఆగి, వాణీనాథంకేసి తిరిగి) ఏరా ?

వాణీ : డాక్టరుగారు రాలేదేం, ఈవాళ ?

మురా: వొద్దన్నాను!

వాణీ : ఎందుకని ?

మురా: మరోడాక్టరుకి కబురంపించాను,

వాణీ : ఆయనెవరు ?

మురా: డాక్టరు గంగాజలం అని విదేశాల్లో చదువుకున్న వాడు. ఈమధ్యనే ఇక్కడ ప్రాక్టీసుపెట్టాట్ట!—మన భైరవమూర్తి వెళ్ళి తీసుగురమ్మన్నాను.

వాణీ : ఏమిటన్నయ్యా, నీచాదస్తం?—అంత ఫీజు మనం ఎల్లా ఇచ్చుకోగలం?

మురా: (సమాధానం చెప్పకుండా వాణీనాథంకేసి నిశ్చలంగా చూసి నిట్టూర్చి, డ్రాయరుదగ్గరకెళ్ళి జేబులోని పేకెట్‌లోంచి ఓమాత్ర తీసి, బల్లమీద ఉన్న నీళ్ళ గ్లాసు తీసుగుని వాణీనాథాన్ని సమీపిస్తాడు.) తమ్ముడూ! ఈమాత్ర మింగు!

వాణీ : (ఇచ్చినమాత్ర పుచ్చుగుని చూస్తూ) ఏమిటిది?

మురా: మాత్ర!—

వాణీ : అదే, ఎందుకు?

మురా: మింగడానికి!—

వాణీ : (నీరసంగా నవ్వి) సరే!—(అని నోట్లోవేసుగుని మురారి అందించిన గ్లాసులో నీళ్ళుత్రాగి గ్లాసుతిరిగి మురారికి ఇచ్చేస్తాడు. ఒక్కక్షణంలో వాణీనాథం బరువెక్కిన కళ్ళతో లీలగాచూస్తూ పక్కమీద మెల్లిగా వాలిపోతాడు. మురారి బీడికాలుస్తూపచార్లు చేస్తూంటాడు.)

మురా: తమ్ముడూ!—(సమీపించి) తమ్ముడూ!—

వాణీ : (నిద్దర్లోలాగ) ఊ!—

మురా: జానకి వచ్చిందిరా !—

వాణీ : (అల్లాగే పడుక్కుని) ఊ !—

[మురారి తలపంకించి, చిరునవ్వుతో మళ్ళీ పచార్లు ప్రారంభించి, ఉత్సాహంగా బీడీకాలుస్తూంటాడు. L. F. లోంచి శంకరయ్య ఆదుర్దాగా వస్తాడు.]

శంక : నమస్కారమండి, మురారిగారూ !

మురా: ఊ !—

శంక : కవిగారికి ఎల్లాఉంది ?

మురా: అల్లానే ఉంది.

శంక : పాపం !—ఏంచేస్తున్నారు ?

మురా: పడుక్కున్నాడు !

శంక : సరే !—(అంటూ కుర్చీలో చతికిలబడి జాలిగా నిట్టూర్చి) జానికమ్మగారికి ఉత్తరం రాయకపోయారా?

మురా: ఇంకా టైముంది !

శంక : (కంగారుగా, దణ్ణంపెట్టి) అబ్బెబ్బే. నా ఉద్దేశం అది కాదు —కాస్త, ఎదీ ?—ఆడదిక్కు అవసరంగదా అని !

మురా: మీరంతా ఉన్నారుగా ?

శంక : అడ్డమా ?—అందుకోసంకాదు ! (L. F. లోకిచూసి) అదేమిటీ ? కారాగి నట్టుంది ?

మురా: డాక్టరుగారు వచ్చేంటారు. (అంటూ L F లోకి చకచకా వెళ్ళి, వెంటనే మళ్ళీప్రవేశిస్తూ) రండి డాక్టరుగారూ!

[ముందు డాక్టరు గంగాజలం, వెనకాల మెడికల్ బాక్సు పుచ్చుగుని భైరవమూర్తి ప్రవేశిస్తారు.]

శంక : (వెంటనేలేచి) నమస్కారమండీ!—లండను దేశంలో చదువుకొచ్చి—ఎదీ?—ఇక్కడ కొత్తగా ప్రేక్టీసు పెట్టినవారు కదూ తమరూ?

గంగా: అవునండి, నాపేరు డాక్టరు గంగాజలం!

శంక : బావుంది!—నాపేరు గంపశంకరయ్య! —ఈఇంటికి యజమానిని! (కుర్చీచూపెట్టి) దయచెయ్యండి!

గంగా : Thank you! (అని కూచుంటాడు.)

శంక : ఇదుగో, భైరవమూర్తి!—డాక్టరుగారిని తీసుకురావడానికి నువ్వే వెళ్ళావా?

భైర : మరేనండి! వారు పంపించారు.

గంగా : I like him! —మంచి పబ్లిక్ ఇంటరెస్టు ఉందండి, ఇతనికి!

మురా : అంతేకాదండి! —ఇతను ఈవూరికి సజీవమైన దూరశ్రవణయంత్రం! (డాక్టరు, శంకరయ్యానవ్వుతారు.)

గంగా : అన్నట్టు, చూడండి శంకరయ్యగారూ!—నాకు మంచి decent గా ఉన్న బంగళాఒకటి అద్దెకు కావాలండీ!—మీ ఎరికలో ఏమైనాఉందా?

శంక : ఇళ్ళ ఇబ్బంది ఈవూళ్ళో బాగాఉందండి!—అన్నట్టు టోపీబజారు ఎరుగుదుగా?

మురా : డాక్టరుగారూ!—

గంగా : One minute! టోపీబజారంటే— ఊఁ!—మసీదు డౌనులోదేనా?

శంక : చిత్తం! అక్కడబజారుని ఎదురుచూస్తూ—ఎదీ?—విశాలమైన రెండంతస్తులమేడ ఒకటి ఉండాలి!—నాదే! ప్రస్తుతం కాళీగానే ఉంది!

గంగా : Is it so!

మురా : (విసుగ్గా) అంటే వెనక, సాయెబు ఎవరో ఉరోసుగు చచ్చిపోయాడన్నారు, అదేనా?

శంక : (తెల్లబోయి) రామ, రామ!

గంగా : What! ఉరోసుగు చచ్చిపోయాడా?

మురా : మరేనండి!—ఆతరువాత దెయ్యమై అక్కడే తిరుగుతున్నాడంటారు!

శంక : ఇదెక్కడ దారుణమండీ?

గంగా : No, No! –దెయ్యాలంటే మనకి భయంలేదుగాని, అసలుపడదు! (అనిలేస్తూ) Any way, Patients first!—రండి!..

మురా : Thanks!—భైరవమూర్తి! కుర్చీ అల్లావెయ్యి! (భైరవమూర్తి కుర్చీ వాణీనాథంమంచం ఎదర వేస్తాడు. గంగాజలం కుర్చీలో కూచుంటాడు.)

గంగా: ఊఁ!—వీరేనా కవిగారు ?

మురా: అవునండి.

గంగా: Very good !—కవిగారూ—ఏమిటి మీకు బాధ!

వాణీ : (అస్పష్టంగా) ఊఁ !

మురా: అదే అర్థమవటంలేదండి.

గంగా: సరే!—చొక్కా—తీసి థర్మామీటరు పెట్టండి ! (అని థర్మామీటరు మురారికి ఇస్తాడు. మురారి, వాణీనాథం చంకలో థర్మామీటరు ఉంచుతాడు. భైరవమూర్తి పట్టుగుంటాడు. డాక్టరు నాడి పరిక్షీస్తూంటాడు.)

మురా: శంకరయ్యగారూ!—దయచేసి, పెరట్లో కుళాయి దగ్గరకెళ్ళి ఓ తప్పేలాతో నీళ్ళు తీసుకువస్తారా ?

శంక : అయ్యో, తప్పకుండాను ! (అని R. F. లోకి విచారంగా వెడతాడు.)

మురా: భైరవమూర్తీ !

భైర : ఏమండీ ?

మురా: ఆగదిలో కెళ్ళి, నాపెట్టె తెరిచి, కొత్తతువ్వాలుంటుంది, వెతికి పట్రా, నాయనా !

భైర : (థర్మామీటరు, మురారికిస్తూ) అల్లాగేనండి! (అని వెంటనే M. B. లోకి వెళ్ళిపోతాడు.)

గంగా: (మురారిదగ్గర్నుంచి థర్మామీటరు అందుకుని పరీక్షించి) Fever జాస్తిగానే ఉంది!—కొంచెం Water తీసుకురండి !—ఎన్నాళ్ళనుంచి ఉంది ఈ Fe·er ?

మురా: (బల్లదగ్గిర నీళ్ళగ్లాసు పుచ్చుగుని నిలబడి, వాణీ నాథాన్ని చూపెట్టి) క్షమించండి!—ఒకసారి ఇటు దయచేస్తారా?

గంగా: Oh yes!—(అని వెళ్ళి ధర్మామీటరు దులుపుగుంటూ వెళ్ళి గ్లాసులో ముంచి, తుడుచుగుని జేబులో పెట్టుగుంటూను.)

మురా: ఈ జ్వరం అయిదారు సంవత్సరాల్నుంచి ఉంధండి.

గంగా: (ఆశ్చర్యంగా) What!—అయిదారు సంవత్సరాల్నుంచా?

మురా: చిత్తం!

గంగా: ఇదివరకు ఎవరేనా Treat చేశారా?

మురా: పెద్ద ఆసుపత్రిలో జేర్పించామండి! (అంటూ డ్రాయరు తెరిచి X-Ray ఫొటో ఉన్న కవరూ, కొన్ని కాగితాలు తీసి) కాని ఈ కాగితాలు ఏవో ఇచ్చేసి ఒకవారం రోజులక్రితం ఇంటికి వెళ్ళిపొమ్మన్నారండి.

గంగా: ఏమిటది?—ఎక్సురేనా?

మురా: చిత్తం!

గంగా: (X-Ray ఫొటో కవరుమీద ఉన్న సంగతులు గమనించి) Oh!- Bilateral P. T.!– Dr. Rao treat చేశారా!—ఊ!—ఈకవిగారు మీకేమవుతాడు?

మురా: నా తమ్ముడండి!

గంగా: కవిగారి పేరు ?

మురా: మురారండి !

గంగా: (ఎక్సురే పైకితీసి చూస్తూ) ఆతలుపుబాగా తెర వండి ! (అని పరీక్షగా చూస్తూ ఫొటోనిండా ఉన్న Cavities గుర్తించి, వెంటనే కవరుమీదరాసిన సంగతులు మళ్ళీ గమనించి, పేషంటుని చూసి) My God!—ఈయన పచ్చి తాగుబోతులా ఉన్నాడే !

మురా: అవునండి.

గంగా: బాగానేఉంది !—Latest O. P. Tikcketఇవ్వండి• (మురారి తొందరగా కాగితాలు తిరగేసి. ఒకటి గుర్తించి ఇస్తాడు. గంగాజలం అదిచూసి)E. S. R 80 m. m !—ప్చ్ !—(అనిభుజాలెగరేసి) బరువేమన్నా తగ్గాడా ?

మురా: చాలా తగ్గిపోయాడండి !

గంగా: (చిరునవ్వుతో) ఇంకా నిండుగానే ఉన్నాడే !—అది సరే ! దగ్గుతున్నప్పుడు నెత్తురేమైనా పడుతోందా ?

మురా : అప్పుడప్పుడు చాలాకూడా పడిపోతోందండి !

గంగా: ఏమాత్రం ?

మురా: ఇంతింత ముద్దల కిందండి !

గంగా: (నిశ్చయానికి వచ్చేసినట్టు తలపంకించి) Well, No use! It's a hopeless case. ఏం లాభంలేదండి ! (మురారి దెబ్బతిన్నట్టు చూస్తాడు. M. B. లోంచి

భైరవమూర్తి కొత్తతువ్వాలుతో వస్తాడు. డాక్టరు సిగరెట్ వెలిగిస్తాడు.)

భైర : ఇదేనాండి, కొత్తతువ్వాలు ?

మురా: అదే !—శంకరయ్య ఏం చేస్తున్నాడో, చూడు !
(భైరవమూర్తి తొందరగా h. F. లోకి వెడతాడు. మురారి ఆవేదనతో డాక్టర్ని సమీపించి) డాక్టరు గారూ !—లాభం లేదనకండి !— మీరు కోరినంత ధనం ఇచ్చుకుంటాను. నామురారిని రక్షించండి !

గంగా : Very sorry ! Dr. Rao కంటూ expert ఈ దేశంలో లేడు !

మురా : (కన్నీళ్ళతో) అయితే నామురారిని ఎవ్వరూ బతికించలేరా !

గంగా : తాగుడు శరీరాన్ని ధ్వంసం చేసేసింది. చెయ్యి దాటిపోయింది, brother !— ఇంక దేముడుకూడా ఏం చెయ్యలేడు. (అని లేస్తాడు.)

మురా : ఎంత అభాగ్యుణ్ణి !—డాక్టరుగారూ !—నాదొక్క ప్రార్థనండి !

గంగా : ఏమిటది ?

మురా : అతను దేశప్రఖ్యాతి ఆర్జించుకున్న మహాకవి !— తాగుబోతని ఎవ్వరికీ తెలియదు. మనిషి ఎల్లానూ దక్కడంటున్నారు ! అతనికీర్తి గౌరవాల్నైనా నాలుగు

కాలాలపాటు నిలబెట్టి పుణ్యంకట్టుగోండి, డాక్టరు గారూ !

గంగా : ఏంచెయ్యమంటారు ?

మురా : ఎవరడిగినా తాగుడువల్ల అతనీస్థితికి వచ్చాడని దయచేసి చెప్పకండి !

గంగా : అల్లాగే !—దానికేముంది !

మురా : Thank you very much, Doctor !— (అని వాణీనాథందగ్గరకి విసురుగా వెళ్ళి, వాణీనాథం గుండెల మీాద తలపెట్టి దుఃఖిస్తాడు.)

శంక : (R. F. లోంచి నీళ్ళతప్పేలాతో వస్తూ) ఆ దిక్కుమాలిన కుళాయిలో నీళ్ళు వెనక్కి పోతున్నాయేమిటి, మురారిగారూ ? (వెనకాలే భైరవమూర్తి R F. లోంచి వస్తాడు.)

గంగా : No, No !— వారినిప్పుడేం disturb చెయ్యకండి. poor poet !

మురా : పోనీ తమరుకూడా ఓసారి పూర్తిగా పరీక్షించండి, డాక్టరుగారూ !

గంగా : మీాకు చాదస్తం ఏమిటండీ ? (అని శంకరయ్యకి సంజ్ఞ చేసి తప్పేలాలో చేతులుముంచి కడుక్కుని, భైరవమూర్తి అందించిన తువ్వాల్తో తుడుచుకుంటూంటాడు.)

శంక : ఎల్లాఉంది, డాక్టరుగారూ ?

గంగా : ఏం లాభంలేదండి !—

శంక : అయ్యో, అయ్యో!—(అంటూ తప్పేలా భైరవ మూర్తికి అందించేసి గుండె బాదుకుంటూ) కొంప ముంచేశావుకదయ్యా, కవిగారూ !—మనిషి బాగానే ఉన్నాడండీ !

గంగా: ఆ జబ్బు తీరేలంత !—

భైర : అయితే పరిస్థితి ప్రమాదంగా ఉందాండి ?

గంగా: ప్రమాదంగానే ఉంది—మనిషికూడా ఆట్టే తెలివిలో లేడు!—మహాబతిగితే ఇంక నాలుగైదు రోజులు!— మనమేం చెప్పలేం !

భైర : అల్లానా?–అయితే నాకు చాలాపనుంది ! (అంటూనే L. F లోకి దూసుకుపోతాడు.)

గంగా: (ఆశ్చర్యంగా) అల్లా పరిగెడుతున్నా డెక్కడికి ?

శంక : ఊళ్ళో చెప్పడానికి!—ఉద్దండుడు లెండి!–అరగంటలో చుట్టేస్తాడు !

గంగా: (చిరునవ్వుతో) గట్టివాడే!—నేను వస్తాను !

[డాక్టరు L. F లోకి వెడతాడు. మురారి అతని వెనకాలే Medical Box తీసుకుని వెడతాడు. శంకరయ్య ఆశ్చర్యంతో కవిని సమీపిస్తాడు.]

శంక : కవిగారూ !—వాణీనాథంగారూ ! (పెదవి విరిచి, నిట్టూర్చి ఓదణ్ణం వెడతాడు. L F. లో వచ్చి

నుంచున్న మురారితో) ఓ వెలుగు వెలిగాడు, వెళ్ళి పోతున్నాడు !

మురా: (బాధతో) శంకరయ్యగారూ ! (అంటూ వెళ్ళి శంకరయ్యని కౌగలించుకుని దుఃఖిస్తాడు.)

శంక : అబ్బా!—మీరూ ఇల్లాబాధపడితే ఎల్లాగండీ?— వెళ్ళినవాళ్ళల్లా అదృష్టవంతులే!—ఊరుకోండి!— నాకుమాత్రం—ఎదీ?-గుండె చెరువై పోటంలేదూ?- మింగేసి ఊరుకోవాలి, అంతే!

మురా: నేను పోయినా బాగుండేది !

శంక : మన చేతుల్లో ఉందేమిటండీ ?-అంతా-ఎదీ?-భగవత్సంకల్పం!—అంతే !

మురా: ఇల్లా జరుగుతుందని నేనెప్పుడూ అనుకోలేదండి !

శంక : మీరన్న మాటేమిటీ ?-ఎవ్వరూ అనుకోలేదు !

హను: (L. F. లోంచి హడావుడిగా ప్రవేశిస్తూ) ఎంత ఘోరం !-ఎంతఘోరం !-ఏమిటి, శంకరయ్యగారూ!- నేవిన్నది నిజమేనన్నమాట ! (కనికేసి బాధగా చూస్తాడు.)

శంక : (నిరాశగా) ఆ !—

హను : ఏమిటిది ? — భైరవమూర్తి చెబుతే నమ్మలేక పోయాను !—మొన్న నేకదండీ. అంతసన్మానం జరిగింది !

శంక : ఆ సన్మానమే కొంపతీసింది !

హను : ప్చ్ !—కవిగారేమైనా తెలివిలోఉన్నారాండి ?
మురా : వస్తోంది !—పోతోంది !
హను : (దగ్గర కెళ్ళిచూసి) ఎంతప్రజ్ఞ !—ఎటువంటికవి !
శంక : అల్లానేమరీ !
(హనుమంతరావు వెళ్ళి వాణీనాథం కాళ్ళకినమస్కరిస్తాడు.)
హను : శంకరయ్యగారూ ! నాకోఆలోచన తడుతోంది !—కవిగార్ని వెంటనే ఏ బొంబాయేనా తీసుకుపోతే ?
శంక : గంగాజలంగారు —ఎదీ ? — లండనులో చదువుకొచ్చారు !
హను : అదీనిజమే !— అయితే దేశానికీ వన్నె తెచ్చిన మహాకవిని చూస్తూ వదిలేసుకోవడమేనా ?
మురా : వదిలెయ్యడానికీ, బిగించడానికీ మనం ఎవరం ?—వన్నె తెచ్చినా కన్నుపొడిచినా మరణం చేతుల్లో అంతాసమానులే !
గుర : (L. F. లోంచి కంగారుగా వస్తూ)ఏటి శంకరయ్యా !-కవిగారికి శానా ఇదిగా ఉందంటగా ?
శంక : అయ్యో, అయ్యో !—తమరా !—దయచెయ్యండి, గురవయ్యగారూ !—కవిగారి పరిస్థితి ఏమీబాగా లేదు !
గుర : (ముక్కుమీద వేలేసుగుని) చ్చుచ్చుచ్చు ! —ఢిల్లీకి టముకు పోనుమాట్లాడుతూంటే భైరవమూర్తి భడా

లున చెప్పాడు. అంతే!—ఫోనట్టాగే పారేసి చక్కా-
వచ్చినాను!—రామ, రామ!–ఎట్టాంటికవిగారండీ!
వయసయినా ఏమాత్రం ఉందండీ? —ఆ?–నన్నడి
గితే అంతప్రజ్ఞ అసలుండకూడదండి!

మురా : మరే! చెబితే వినేవాడుకాదండి!—

హను : అసలు దేశానికి అదృష్టంలేదండి!

గుర : అంతేనండి. లేకపోతే నాకొట్టుముందునుంచి రోజూ
ఎడుతూండేవాడండి, మహానుభావుడు! —ఆయన కీ
జబ్బేటి చెప్పండి!

హను: ఆయన నూటల్లో సరస్వతి నాట్యమాడేది కదండీ!

గుర : అవును!—ఏం వుపన్యాసం!—ఏం ధోరణీ!

శర : (L. F. లోంచి చటుక్కుని చక్కా-వచ్చి) శంకరయ్య
గారూ! తమరూ ఉన్నారా ఇక్కడ? ఏమిటండీ
దారుణం?

శంక : అంతేనండి, దారుణమె!

మురా: తమరంతా నిలబడే ఉన్నారు!—

శర : ఇంక నిలబడ్డా ఒకటే కూచున్నా ఒకటే! నీటి
గురించి ఏమి ఆలోచించకండి! (వాణీనాథం దగ్గరకి
విచారంతో వెళ్ళి నమస్కరించి) ఎన్ని ఆశలుపెట్టు
కున్నానండి, మీ మీద! ఎంతపనిచేశారు!—
(శంకరయ్యతో) అన్ని పనులూ ఆపేసి ముందర వీరి
పుస్తకం అచ్చువేయిద్దామనుకున్నాను — పుస్తకం

సర్వాంగ సుందరంగా తయారుచేయించి, అపూర్వ మైన ఆవిష్కరణ మహోత్సవం జరిపించి, కవిగారికి కనీసం వెయ్యి నూట పదహార్లేనా సమర్పించు కుందా మని ఎంతో అనుకున్నాను !—పూర్తిగా దగాచేసే శారు, కవిగారు !

శంక : అంతెందుకండీ, శఠగోపంగారూ !— వారు తమ అమూల్య గ్రంథాలన్నీ ఈగదిలోనే—ఎదీ ?— ఈ గదిలోనే వ్రాశారు.

గుర : అట్లాగా ?

శంక : ఆ ! ఈ గృహాన్ని సరస్వతీ నిలయం చేసేశారు కదండీ !—ఆ మహాకవికి ఈ గృహాన్నే సర్వహక్కు లతోటీ సమర్పించుగుని—ఎదీ ?—నాజన్మ సార్థకం చేసుగుందామనుకున్నాను !—అదృష్టంలేదు !

మురా: (విసురుగా, బాధగా) ఛీ !—పాడుబ్రతుకు !

శఠ : బాధపడకండి, మురారిగారూ !

మురా: గుండెలు మండిపోతూంటే బాధ కాదుటయ్యా శఠ గోపంగారూ !

శంక : బాధేమరి !—అయితేం ! నిలవొక్కటు తీరాలి !— అంతకన్నా ఏం చెయ్యగలం ?

గుర : (L. F కేసి నడిచి, తొంగిచూసి) ఛైర్మన్ గారు, వస్తున్నారు.

[L. F. లోంచి ఛైర్మన్ జనతారావు, మేష్టరు పరంధామయ్య, చివరకి తాపీగా భైరవమూర్తి వస్తారు]

గుర : (నమస్కరిస్తూ) దయచెయ్యండి, ఛైర్మన్ గారూ!— దయచెయ్యండి !

జన : (ఆదుర్దాగా) ఏరీ ? కవిగారేరీ ?

మురా: అరుగోనండీ !

జన : (దగ్గరకెళ్ళి, చూసి, తెల్లబోయి) ఎల్లా అయిపోయారు! కవిగారూ !—కవిగారూ !

పరం : కవిగారూ !—నేనూ పరంధామయ్య మేష్టార్ని !— మనఛైర్మన్ జనతారావుగారు వచ్చారు !

మురా: మనిషి మనలో లేడండి !

పరం : (నోరుతేలేసి) ఏమిటీ !—

జన : వారెవరూ ?

శత : కవిగారికి కేవలం అన్నగారండి ! మురారిగారు !

జన : అల్లానా, పాపం ! (మురారి విచారంగా తలవంచుగుని బాధపడతాడు.) విచారించకండి, మురారిగారూ!—ఈ కష్టం తమరొక్కరిదేకాదు. యావత్తు పట్టణాందీను !

పరం : పట్టణాం ఏమిటండి, జనతారావుగారూ !—దేశానికే తీరనిలోటు !

జన : అంతేనండి!(కవినిజాలిగా చూస్తూ)తలుచుగుంటూంటే పరమాశ్చర్యంగా ఉంది ! (గురవయ్యతో) మొన్ననే కదండీ నాతో సన్మాన సభలో కూచున్నాడీయన ?— అంతలోకే ఇంతెల్లా ముంచుకొచ్చిందండీ ?

గుర : చిత్తం !—తమరు సెలవిచ్చినట్టు, ముంచుగొచ్చేసిందండి, అంతే !

ఛైర : మొన్న, మొన్న అంటారేమిటండి, ఛైర్మన్ గారూ ! ఇందాకా నేను డాక్టరుగారి దగ్గరికి వెళ్ళే ముందు కవిగారు స్పష్టంగా మాట్లాడుతున్నారు. డాక్టరుగారిని తీసుగొచ్చాను. ఆ ?—(చిటికేసి) మాటపోయింది !

పరం : ఇన్నిమాట్లెందుకూ ? కాలం, ఖర్మం కూడితే సమయం, సందర్భం అన్నీ చక్కాపోతాయి !

జన : అంతే, మేష్టరుగారూ, అంతే !—కవిగారు రాసిన పద్యాలన్నీ చదివాను. ఎంతభావగర్భితంగా ఉంటాయనుకున్నారు !

హను : ఆయన రాసిందంతా వచనమేనండీ !

జన : అల్లానా !—అదిమాత్రం ?— ఎంతబాగుండేది !—పంచదారపాకం కదండీ !

[బయట, జనం కోలాహలం వినిపిస్తుంది. జమీందారు, శిల్పిగోపాలం, L. F. లోంచి, జనాన్ని తప్పించుగొచ్చినట్టు వస్తారు.]

జమీం : (కోపంగా) ఈజనానికి అర్థంపర్థం ఉండదు. అదుగో పులి అంటే ఇదుగోతోక అనడం, ముందు దార్లన్నీ మూసెయ్యడం !—(L. F. లోకి చూస్తూ) లోపలికీ బయటికీ జనం తిరగాలా ?—కాస్త ఎడంగానుంచోండి (కోలాహలం తగ్గిపోతుంది.)

జన.: నమస్కారం, జమీందారుగారూ!

జమీం : నమస్కారం!—ఏమిటండి, జనతారావుగారూ!—ఈజనమేమిటి, ఈ కోలాహలమేమిటి?—Discipline ఇంకా ఎన్నాళ్ళకొస్తుందండి మనవాళ్ళకి?

జన : చిత్రం!—దీనికంతకీ అసలుకారణం ఈ భైరవమూర్తండి! విశేషమేమన్నా విన్నాడంటేచాలు! ఇంక ఊళ్ళోజనానికి పనితోచనీయడు!

భైర : అన్నీమీరే అంటారేమిటండి, చైర్మన్‌గారూ!—కిందటిసారి, మీతో ఎలక్షనుకి నిలబడ్డ సుబ్బారాయుడు దివాళాతీశాడని తమరు అల్లరిచేసి రమ్మంటే పదహారుగంటలు తిరిగినా సరిపోలేదన్నారు. ఇప్పుడు ఇరవై నిమిషాలు తిరిగొచ్చాను, ఎక్కువయిపోయిందంటారేమిటి?

జన : (కంగారుగా) సంతోషించాంగాని, నువ్వు ముందు వీధులోకెళ్ళి కవిగారికి చాలా ప్రమాదంగా ఉందనీ, పెద్దలంతా ఆలోచిస్తున్నారనీ, గొడవచేస్తే మాట దక్కదనీ, చెప్పు!—ఆ?

భైర : (చురుకుగా) చిత్రం!—ఊళ్ళోకూడా ఓ రౌండు కొట్టి వచ్చెయ్యమంటారా?

జన : (విసుగ్గా) నీరౌండ్లు బంగారంగానూ!—అక్కడనుంచుని చెప్పవయ్యా చాలు! (నిక్కచ్చిగా) నువ్వెక్కడికీ వెళ్ళకు!

భైర : (నిరుత్సాహంతో) చిత్తం! (L. F. లో నుంచుని, గట్టిగా) మహాజనులారా! (బయట కోలాహలం బయల్దేరుతుంది.)

జమీం: గోపాలం!—ఆయన్ని అవతల నుంచోమని తలు పేసెయి! (భైరవమూర్తి కంగారుగా L. F. లోకి పోతాడు. గోపాలం తలుపేసేస్తాడు. కోలాహలం తగ్గి పోతుంది.)

జన : జమీందారుగారూ!—కవిగారి పరిస్థితి చాలా విష మంగా ఉంది! నాకు ఏంచెయ్యడానికీ ఏమీతోచడం లేదు. ఏ మద్రాసునుంచేనా పెద్ద డాక్టర్లని తీసు కొచ్చే ఏర్పాటు చేద్దామంటూరా?

జమీం: ఏమీ లాభం లేదండి!—నేనిప్పుడు డాక్టరు గంగా జలాన్ని స్వయంగా కలుసుకుని అన్నివిషయాలూ మాట్లాడివచ్చాను. కవిగారు మహాబతికితే నాలుగైదు రోజులనీ, దాటడం అసంభవమనీ, నమ్మకంగా చెప్పే శాడు!

శంక : (నాలిక ఝూడించి) ఏమైనా డాక్టర్లు డాక్టర్లేగాని జ్యోతిష్కులు కారుకదండీ!

జమీం: (వాడిగా చూస్తూ) నేను డబ్బిచ్చి, గంగాజలాన్ని చదువుకి లండను పంపించానయ్యా!—ఆ చదువుకి విలువ లేదంటూ వేమిటి?

శంక : (దణ్ణం పెడుతూ) క్షమించాలి!—అల్లా అయితే—
ఎదీ ?—అక్షరాలా జరిగి తీరుతుంది !

జమీాం: ఊఁ!—ఒకసారి ఉండండి! (కవి దగ్గరకు వెళ్ళి, తల పంకించి, మురారితో) తెలివిలోకి రాలేదా?

మురా: రాలేదండి !

జమీాం: (కవి కాళ్ళవైపు నుంచుని, గద్గద స్వరంతో, గంభీరమైన ధోరణిలో) మహాకవీ!—నీరాకవల్ల, నీరచనల వల్ల ఈ నగరం శోభాయమానం అయింది. నీ అస్తమయం ఈ నగరాన్నే కాదు, ఈ దేశాన్నే అంధకార బంధురం చేస్తుంది.—ఏమైనా నీ భాషాసేవ తెలుగు జాతి మరువలేదు!—నీపేరు తెలుగు నాలికలమీాద శాశ్వతమయి తీరుతుంది!—

[అని కాళ్ళకు నమస్కరించి, జేబురుమాలుతో కళ్ళు తుడుచుగుంటూ వచ్చి కుర్చీలో కూచుంటాడు. అది చూసి ఒక్కొక్కరే విచారంతో వెళ్ళి, కవికాళ్ళకి నమస్కరించి కొందరు, కవికాళ్ళే నెత్తిమీాద పెట్టుగుని కొందరు, యథాశక్తి భక్తిగౌరవాలు ప్రకటించి వస్తారు]

హను: (అంతులేని ఆవేదనతో) ఛైర్మన్‌గారూ!—ఈ మహాకవికి మనం ఏదేనా జేసితీరాలి!

జమీాం: ఏదేనా ఏమిటయ్యా?—ఏ దేశంలోనూ ఎవ్వరూ ఏ కవికీ చెయ్యనంత చెయ్యాలి!—అప్పుడే మనకున్న ప్రత్యేక భక్తిశ్రద్ధలు ప్రకటితమవుతాయి !

గోపా: ఆహా!—లక్షరూపాయలు విలువచేసే మాట సెల విచ్చారు. జమిందారుగారు!

జన : (ఉత్సాహంతో) అయితే మనం ఓ లక్షరూపాయలు పోగుచేసి కవిగారికి చదివించేస్తే?

శంక : దాంతోపాటు—ఎదీ?—సరస్వతీ నిలయమైన ఈ గృహాన్నే కవిగారికి రాసిచ్చేస్తాను!

మురా: మీ అభిమానానికి నా జోహార్లు!-అయినా ఈ కవి బతికే దెన్నాళ్ళు?

హాను: నాలుగైదు రోజులని చెప్పేశారుగా?

మురా: నాలుగైదు రోజుల్లో ఈభూమినే కాళీచేసి వెళ్ళి పోయే నరుడికి లక్షలూ, గృహాలూ ఏం ఉపయోగ పడతాయి? అందులో కవికి అవెందుకు?-కవికీ, కళా కారుడికీ డబ్బుతో పనిలేదు!—శంకరయ్యగారూ!-ధనరాసులు వాళ్ళకి పెంటపోగులు!—వాళ్ళుకోరేది, అర్థించేది, పాకులాడి ప్రార్థించేది, నిష్కల్మషమైన మీ అంతఃకరణ!—అది మీదగ్గర ఉందా?

(అంతా ఒకరిమొహాలు ఒకరు చూసుకుంటారు.)

జమీం: (మొండిగా) ఎందుకు లేదూ?

శైర్మ : మరే!—బోల్డుంది!

అందరూ: అవును!-ఉంది, ఉంది!

మురా: అయితే చూపెట్టండి!

జమీం: ఎల్లా?

మురా: సరుకుంటే సంశయం ఉండదు! (అని వెనక్కి చూడకుండా విసురుగా M. B. లోకి వెళ్ళిపోతాడు.)

శర : సంశయం ఎందుకండీ?—డబ్బు పోగుచేసి కవిగారి గ్రంథాల్ని అన్నిభాషల్లోకి తర్జుమా చేయించేసి ప్రపంచ ప్రచారం చేసేద్దాం!—ఏమంటారు?

గుర : ఏమో!—పుస్తకాలు కొనుక్కొని చదివే అమాయకులు ఇంకా ఎక్కడున్నారయ్యా?—నన్నడిగితే, పోగుచేసిన డబ్బుతో, కవిగారిపేర మాంచియాపార సంస్థ లేవదీసి, మనమంతా డవిరేటర్లుగాచేరిపోయి, చిరస్థాయిగా నడుపుదామంటాను!—ఎల్లావుంది?

శంక : వ్యాపారమంటే మాట్లాండీ?—ఎంత బాదరబందీ ఉందీ?—పైగా కవిగారిపేర, వ్యాపారం చెయ్యడమనేది—ఎదీ?—అంతసబబుగా ఉండదు. అసలు, ఎందుకింత ఆలోచన?—కవిగారిపేర నిధి ఏర్పాటు చేసి, 'నువ్వు తంటాలుపడు', అని నా నెత్తిమీద పారెయ్యండి. చచ్చో, పుచ్చో, ప్రతీ సంవత్సరం ఒక ఉత్తమ కవికి ఘనసన్మానంచేసి కవిగారి ఋణం తీర్చుగుంటాను!

పరం : అదికాదు. నాకు ఓ చక్కని ఆలోచన తట్టింది!

హాను: ఏమిటది, మేష్టారూ?

పరం : కవిగారిపేర కళాశాల ఒకటి కట్టించి, మనమంతా కమిటీగాచేరి నిర్వహిస్తే?

హను : మేష్టరుగారూ ! మీరెరగరు. కమిటీలు దెబ్బలాడు కుని పని చెడకొట్టడానికి కాని, పని చెయ్యడానికి పనికి రావండి.

పరం : గౌరవోద్యోగు లెందుకు దెబ్బలాడుకుంటారయ్యా ?

హను: అందుకనే దెబ్బలాడు కుంటారండీ !—గౌరవోద్యోగు లంటే ఉద్యోగానికున్న గౌరవం అమ్ముకుని బతికే వాళ్ళని ఊరికే నిర్వచించారా ?

జన : అబ్బబ్బా ! అవసానదశలో కవిగార్ని పెట్టుగుని ఏమిటీ అనవసర ప్రసంగం ?—జమీందారుగారూ ? తమ సలహా సెలవివ్వండి !

జమీం: సలహాలకీ, వాదోపవాదాలకి సమయంకాదిది. దేశ ప్రఖ్యాతి చెందిన మహాకవి మన పట్టణం వాడేనని ఇన్నాళ్ళూ విఱ్ఱవీగాం ! ఆకవితో బాటు మనపట్టణ శోభకూడా అంతరించ బోతోంది. ఆశోభ నిలుపు గోవాలంటే ఆకవినే మనం పునః ప్రతిష్ట చెయ్యాలి. ఆ పునః ప్రతిష్ట శిలావిగ్రహ రూపంలో చేసి, మహా కవిని మనపట్టణంలో శాశ్వతంగా నిలబెట్టుగుందాం ! (అందరూ ఆనందంతో చప్పట్లు కొడతారు)

హను : శిలావిగ్రహం ఆలోచన అద్భుతంగాఉంది, జమీం దారుగారూ !—కాని ఆంధ్రులకి ఆరంభశూరత్వం ఎక్కువనే అపవాదొకటి ఉంది. అంచేత వెంటనే కార్యరంగంలో దూకడం మంచిది !

జన : దానికేం ? శిలావిగ్రహం పనివెంటనే ప్రారంభించమని పురమాయించేస్తాను.

శంక : ఏవో శిలావిగ్రహాలు ప్రతీఊళ్ళోనూ లేవదీస్తునే ఉన్నారు. మన ఊరి ప్రత్యేకత ఏముంది ?

శర : అంతకన్నా వారి బొమ్మ కాగితాల మీద అచ్చోసి ప్రపంచకం అంతా పంచిపెట్టడం మంచిది.

జమీం : అదేంకాదు !—శిలావిగ్రహమే ఖాయం !- పోతే మనప్రత్యేకత ఏమిటో నేను చెబుతాను. సాధారణంగా మిగతాచోట్ల ఏగొప్పవ్యక్తి అయినా చచ్చిపోయిన మూడు నాలుగు ఏళ్ళకి కాలదోషం పట్టిన శిలావిగ్రహాలు మెల్లిగా లేస్తున్నాయి. మన పట్టణంలో అల్లా జరగదు. కవిగారు పోయిన వారంతిరక్కుండా కవిని మరిపించే శిలావిగ్రహం మనమధ్య వెలుస్తుంది!

హను : వారమే!—ఇది నిజంగా అపూర్వమే !

జమీం : అదే మన ప్రత్యేకత!-కవిగారి ఎడల మనకున్న అపార భక్తిశ్రద్ధలకి అదే తార్కాణం !

జన : అవును!-ఇది శిలావిగ్రహ నిర్మాణానికి ప్రపంచ రికార్డవుతుంది !-నేను ఛైర్మన్ గా ఉండగా ఇది జరగడం నా అదృష్టం !

శంక : అదృష్టం మాట దేముడెరుగుకాని-వారంరోజుల్లో- ఎదీ?-అంత శిలావిగ్రహం ఎవడు చేస్తాడయ్యా?

జమీాం: చేయించే పూచీ నాది, శంకరయ్యా!–నే నేమీా అంత ఆలోచించకుండా మాట్లాడ్డం లేదు!–అంతా ఇదివరకే ఆలోచించాను. అందుకనే శిల్పిగోపాలాన్ని కూడా తీసుగొచ్చాను. గోపాలం!

గోపా : (ముందుకొచ్చి) అయ్యా!–

జమీాం: కవిగారు నాలుగైదు రోజుల్లో పోతారని పెద్దడాక్టరు గారు చెప్పేశారు. ఎందుకేనా మంచిది మరో రెండు రోజులు కలుపుగో!– తెలిసిందా ?

గోపా : చిత్తం!

జమీాం: అంచేత ఈరోజునుంచి వారం తిరక్కుండా శిలా విగ్రహం ఆవిష్కరింప బడాలి. ఎటుచూసినా నీకు ఏడురోజుల టైము!—ఏమంటావు ?

గోపా: శిలావిగ్రహం ఏడురోజుల్లో తయ్యారుచెయ్యడం చాలా కష్టమండి.

జమీాం: అదంతా మాకు అనవసరం!—ఏరోనాటికి శిలా విగ్రహం కావాలి. ఏమంటావు ?

గోపా: తమరల్లా సెలవిస్తే నేనేం చెప్పగలను ?—ప్రాణా లర్పించి పనిచేస్తాను. కాని డబ్బుచాలా ఖర్చైయి పోతుందండి!

జమీాం: డబ్బుగురించి అస లాలోచించకు!—ఎన్ని వేలేనా సరే విరజిమ్మేస్తాం! కాని అన్నరోజుకి శిలావిగ్రహం నిలబెట్టాలి—గోపాలం!

గోపా: అయ్యో !

జమీం: మాటతప్పావా ?—మా సంగతి తెలుసుగా ?

గోపా: (భయంతో) చిత్తం !

జమీం: భేష్ ! (హాయిగా నిట్టూరుస్తాడు.)

జన : నాకు మరో ఆలోచన తడుతోంది !

జమీం: (కోపంగా) శిలావిగ్రహం మార్చడానికి వీల్లేదు !

జన : (హడిలిపోయి) అబ్బెబ్బే !—మార్చడం కాదండి !

జమీం: అయితే చెప్పండి !

జన : మనం ఎల్లానూ ప్రపంచ రికార్డు స్థాపించబోతున్న శిలావిగ్రహాన్ని ఆవిష్కరిస్తున్నాం కదా ?—ఈ ఆవిష్కరణ మహోత్సవం ఒక పెద్దమంత్రిగారి చేత చేయిస్తే మరీ కళకడుతుంది !-అనుమానం లేకుండా ప్రతీ పేపర్లోనూ తెగప్రచారమయి పోతుంది ! విదేశాల వాళ్ళుకూడా చదువుతారు !—(ఆనందం పట్టలేకుండా) ఎల్లావుంది ?

శంక : (ఉత్సాహంతో) అప్పుడయితే కమిటీలోఉన్న అందరి పేర్లూ—ఎదీ ?—పేపరుకి పూర్తిగా పంపించాలి !

జమీం: పంపిస్తామయ్యా !

గుర : కాని, నాకో అనుమానం !—

జన : మీ పేరుకూడా పంపిస్తామండీ !

గుర : పంపకపోతే నే నూరుకుంటానేటి ?—అది కాదు !—పెద్దమంత్రిగారికి ఊపిరిసలపనన్ని పన్లుంటాయిగందా?

మరి, కవిగారు పోయినా్నరేళ్ళ 'రేపో ఎల్లుండో రండి, రండి!' అంటే ఆయనగోల! 'నాకు తీరికనే' దంటే ?

జన : (తెల్లబోయి) అవును!—అప్పుడు మన ప్రపంచరికార్డు పాడయిపోదూ ?

హను : ఇది జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయం! జమీందారుగారూ!–తమరే రక్షించాలి!

[జమీందారు తల పంకించి ఆలోచిస్తూ విసురుగా పచార్లు ప్రారంభిస్తాడు. మిగతావాళ్ళు కూడా కంగారు పడుతూ గ్రూపులకింద చేరుతూ, విడిపోతూ నిశ్శబ్దంగా తెగ ఆలోచిస్తూంటారు. L. F. లో తలుపుకొట్టిన చప్పుడు గట్టిగా, తొందరగా వినిపిస్తుంది. అంతా ఆగుతారు. గోపాలం జమీందారు సంజ్ఞ తీసుకుని L. F లోకి వెళ్ళి తలుపు తీస్తాడు. భైరవమూర్తి చెదిరిపోయిన తలతో, వికృత మొహంతో పరిగెత్తుకొస్తాడు.]

భైర : అబ్బ!–వాళ్ళింక ఆగటంలేదు!

జన : ఉండవయ్యా, మరీ!—

భైర : ఉండనియ్యటంలేదండి, మరీ!–లోపలేం జరుగుతోందో చెప్పమని జనం నన్ను రాళ్ళుచ్చుకుని కొడుతున్నారు!

హను: ఇంక అయిదు నిమిషాలని చెప్పు!

భైర : లాభం లేదండి!–వాళ్ళింక అయిదు సెకన్లు కూడా ఆగరు!

శంక : ఏవో రెండు కబుర్లు చెబుదూ!

భైర : కబుర్లా?—వాళ్ళదగ్గిరున్నవి కంకరరాళ్ళు! కవిగారు ఉన్నారో, పోయారో వెంటనే చెప్పమంటున్నారు.

జమీాం: కవిగారి ప్రాణం ఇంక గంటల్లో ఉందని చెప్పు!— ఇటువంటి సమయంలో కేకలేసి అల్లరి చెయ్యడం మన జాతి సంస్కృతికే అవమానమని చెప్పు!–నిశ్శబ్దంగా నిలబడి కవిగారికి కడపటి శ్రద్ధాంజలి అర్పించమని చెప్పు!—వెళ్ళు!

భైర : (భయంగా) చిత్తం! (అని ఎదురు చెప్పలేక బాధగా L. F. లోకి వెడతాడు. గోపాలం తలుపు వేసేస్తాడు.)

గుర : నాకో ఆలోచన తోస్తోంది!

జమీాం: ఏమిటది?

గుర : కవిగారు నాలుగైదు రోజుల్లో పోడం ఖాయమని డాక్టరుగారు నమ్మకంగా చెప్పేశారు. శిలావిగ్రహం ఏడోనాటికి పూర్తి చేసేత్తానని గోపాలం హామీా ఇచ్చేసినాడు. అంచేత, ఆవిష్కరణం ఈరోజునుంచి ఏడోనాటికి తిరపరిచేసి, లోపాయికారీగా, కవిగారు ఈరోజునే పోయారని మంత్రిగారికి ఆవ్హానం పంపించేత్తే?

శంక : (తెల్లబోయి) ఏమిటీ? — కవిగారు ఈరోజునే పోయారని మంత్రిగారికి ఆహ్వానమా?

హను : (ఉత్సాహంతో) అవును !—ఉత్తములైన ఆమంత్రి గారు విచారసాగరంలో మునిగిపోతారు !

పరం : అంతేమరి !—ఉన్నపళ్లన్నీ అవతలికి నెట్టేసి మన ఆహ్వానం వెంటనే అంగీకరిస్తారు !

జమీం : (చిరునవ్వుతో) మీ ఆలోచన దివ్యంగాఉంది, గురవయ్యగారూ !

హను : (ఆవేశంతో) దీంతో మన పట్టణప్రతిష్ఠ ఆకాశాన్నంటుతుంది !

జన : (లీలగాచూస్తూ) ఆంధ్రులంతా మనని ఆరాధిస్తారు !

శంక : (ఆశతోనవ్వుతూ) మనపేర్లు చిరస్థాయిగా నిలబడి పోతాయి !

శర : (పరమానందంతో) అవును !—అయితే ఆహ్వానం వెంటనే అచ్చువేసెయ్యనా ?

జమీం : (నిర్లక్ష్యంగానవ్వుతూ) ఇంకా సందేహమా ?— వేసెయ్యండి, ఓలక్ష !

గుర : మరి, మంత్రిగారి అనుమతిపుచ్చుగోవద్దూ ?

జమీం : నేనిప్పుడు ఫోనులో మాట్లాడుతాను, కదండీ ?

గుర : ఓహో, అట్టనా ?—సరే !

జమీం : తీయవోయి తలుపు, గోపాలం !—(అని కవిదగ్గరకు వెళ్ళి నమస్కరించి) మహాకవీ !—మాకు మీ ఎడల గల భక్తిశ్రద్ధలు శక్తికొలదీ చూపెట్టెయ్య

డానికి నిశ్చయించుకున్నాం !— మా కార్యక్రమం జయప్రదం కావాలని ఆశీర్వదించండి !

మురా : (M. B. లో చిరునవ్వుతోనుంచుని) తెలివిరాగానే చెబుతాను ! అతనిచ్చిన ఆశీర్వాదాలు మీకు వెంటనే పంపించేస్తాను !

జమీం : అయితే, శలవు !

[అని కీవిగా L. F. లోకి వెళ్ళిపోతాడు. ఒక్కొక్కరే కవిగారికి కడపటి నమస్కారం అర్పించి L F లోకి వెళ్ళిపోతారు. ఆఖర్ని మిగిలిన గురవయ్య అతిశ్రద్ధగా దణ్ణంపెడుతూంటాడు.]

తెర



# రంగం-3

[వాణీనాథం ఇంట్లో అదే హాలుగది. బల్లపక్కనున్న కుర్చీలో పరంధామయ్య, మరో చిన్న బల్లమీద హనుమంత రావు కునుకుని, ఇద్దరికీ అందుబాటులో ఉన్న ఆ పెద్దబల్ల మీద వాలి నిద్రపోతూంటారు. తెల్లవారి ఏడుగంటలయినా బల్లమీద కిరసనాయిలు దీపం దిపిటీలా వెలుగుతూనే ఉం టుంది. మంచంమీద వాణీనాథం పడుక్కుని ఉంటాడు. హనుమంతరావు మెల్లిగా లేచి, బద్ధకంగా ఒళ్ళువిరుచుగుని నోరారా ఆవలిస్తూ టైము చూసుగుంటాడు.]

హను: అబ్బా, ఏడయి పోయిందీ!

వాణీ: (మూలిగి) అమ్మా!—(అని నీరసంగా, మెల్లిగా లేచి మంచంమీద కూర్చుంటాడు. హనుమంతరా వునిచూచి ఆప్యాయంతో) ఏం, హనుమంతరావు!— పాపం, రాత్రంతా ఇక్కడే ఉన్నారా? (హనుమంత రావు నోరు తెరుచుగుని, తెల్లబోయి చూస్తూ, యాంత్రికంగా దీపం తగ్గించేస్తాడు.) హు!—ఇప్పుడే వస్తాను! (అంటూ ప్రయత్నంమీద లేచి నుంచుం టాడు.)

హను: (హడిలిపోయి, కంగారుగా వాణీనాథాన్ని జేరి) ఆ, ఆ!—నేను తీసిగెడతా నుండండి!

వాణీ: అక్కర్లేదు, నాయనా !— నేను వెళ్ళగల్ను !—

[మెల్లిగా నడుస్తూ నీరసంగా మూలుగుతూ R. F. లోకి వెడతాడు. హనుమంతురావు, అర్ధరాత్రిసూర్యుణ్ణి చూసినట్టు వెఱ్ఱిచూపేసుగుని నిలబడిపోయి అమాంతం గుండె బాదుకుని, పరంధామయ్య దగ్గిరకిపరిగెడతాడు.]

హను: మేష్టారూ !—పరంధామయ్యగారు !— మేష్టారూ !

పరం : (కంగారుగా లేస్తూ) ఆ, ఆ !—ఏమయింది ?—కవిగారు పోయూరా ?

హను: లేదండి, మేష్టారూ !—నాకు మతిపోతోంది.

పరం : (మంచంవైపు చూచి) కవిగారేరీ ?

హను: (నిరాశతో) అల్లానడిచి చక్కాపోయూరు !

పరం : (హడిలిపోయి) నడిచే !

హను: ఆ !—

పరం : (ముక్కుమీాద వేలేసుగుని, కళ్ళుపెద్దవిచేసి) రామ రామ !—గబుక్కుని తెల్లారకట్ల మెళుకువ వచ్చి చూశాటప్పడికి మంచంమీాద కూచున్నాడు, కవిగారు !—నే నప్పుడే అనుకున్నాను ఇదేదో కొంప మునిగి పోతుందని !—అయితే, హనుమంతరావు!— సుబ్బరంగా నడిచేస్తున్నాడా ?

హను: ఆ !—

పరం : ఇంక మన గతేమిటి ?

హను: (కంగారుగా) మెల్లిగా అంటారేమిటి, మేష్టారూ!— ఈ కవిగారి వరసచూస్తే చాలా ప్రమాదంగా ఉంది. మనిషి పోయేలా లేడు!-(బిక్క మొహంతో) పైగా మంత్రిగా రొచ్చేది లేపేగదా!

పరం : ఎంత ఖర్మ కాలిపోయింది! (ఆలోచించి, కళ్ళెగ రేస్తూ) పోనీ, హనుమంతరావు!-మిగతావాళ్ళెదో ఏడుస్తారు, మనిద్దరం ఈవ్వూర్నించి పారిపోతే!—

హను: ఎల్లా?

పరం : నా సైకిలుంది!—

హను: అబ్బ, అది కాదయ్యా!-బడిపంతులు గనక-మీకేం?-హాయిగా దులుపుగు చక్కాపోతారు!-నాకు ఇళ్ళూ, పొలమూ ఉన్నాయి. పైగా కౌన్సిలర్ని! (అని తల పట్టుగుని కూచుంటాడు.)

పరం : అయితే కవిగారి పరిస్థితి ఇల్లా ఉందని జనతారావు గారికి తక్షణం చెప్పేద్దాం!

హను: (నిట్టూర్చి) ఇంక అంతకంటూ మనం చేసేదేముంది? కాని, జనతారావుగారితో తొందరపడి చెప్పకండి, ఆయన కసలే బ్లడ్ప్రెషరుంది! (లేచి నెర్వస్‌గా తిరుగుతూ) ఇప్పుడు ఏమిటి చెయ్యడం? కవిగారు బతుగుతున్నారని తెలుస్తే ఊళ్ళోవాళ్ళు చంపేస్తారు! ఒకటా, రెండా, ముప్పయివేలు వసూళ్ళు చేశాం!

పరం : (బాధగా, కోపంగా) అంతెందుకు మరీనూ!—

హను: (M. B లోంచి వస్తున్న మురారిని చూసి, కంగారుగా, పరంధామయ్యకి సంజ్ఞ చేస్తూ) ఉష్!

మురా: (చిరునవ్వుతో) ఏం అల్లా కూచున్నారు?

పరం : మీరా? (నీరసంగా నవ్వి) ఆ, ఏంలేదు!—తెల్లారిపోయిందిగదా ఇంక ఇంటికెడదామని!

మురా: అల్లానా!—వెళ్ళిరండి!

[ఇద్దరూ ఉత్సాహంతో తలకాయిలూపి, ఒకళ్ళ మొహాలు ఒకరు చూసుగుని, విచారంతో ఆలోచించుగుని L. F లోకి తొందరగా వెళ్ళిపోతారు. మురారి తల పంకించి, దగ్గి మూలుగుతూ కుర్చీలో కూచుని అమ్మా అనుకుంటూ తల వెనక్కి వేళ్ళాడేసుగుని ఉండిపోతాడు. L. F. లోంచి కంగారుగా జానకి ప్రవేశించి, సంచీ బల్లమీద పడేస్తూ, కాళీమంచం చూసి, చెప్పలేని భయంతో తెల్లబోతుంది.]

జాన : (కంగారుగా) బావగారూ!—బావగారూ!

మురా : ఆ?—ఎవరూ? (చూసి) జానకా?

జాన : వారేరీ?—ఆయనకెల్లాఉంది?

(L. F. లోంచి జగన్నాథం ఆదుర్దాగా వస్తాడు.)

మురా : కంగారుపడకు!—కులాసాగనే ఉన్నాడు, లోపలికెళ్ళాడు. (జానకి వెంటనే R. F. లోకి వెళ్ళిపోతుంది.) రండి, మామగారూ! (అంటూ కుర్చీ ఇచ్చి) మీ కెవరు చెప్పారు, ఈసంగతి?

జగ : (నిట్టూరుస్తూ) ఏమో, నాయనా ! ఇక్కడికి కొచ్చేదాకా గుండెల్లేవు !— హుం—సాయంత్రం పిడుగులా వచ్చింది, ఉత్తరం !

మురా : ఉత్తరమా ? ఎవరురాశారు ?

జగ : అతనెవరోమరి ! భైరవమూర్తిట !

మురా : (చిరునవ్వుతో) హారి వీణ్ణి అంటించా ! భైరవ మూర్తా ? వీడికి ఇదివరకు ప్రేక్టీసు ఊళ్ళోనే ఉందను కున్నాను. జిల్లామునిషన్నమాట ! (అని నవ్వి దగ్గ తాడు.)

జగ : నువ్వు మరీనీరసంగా ఉన్నావేం, మురారీ ?

మురా : నిచ్చెనమీంచి మెట్లు దిగుతూంటే కిందికి రావండి, మరీ ?

జగ : అల్లాఊరుకుంటే లాభంలేదుసుమా !—మంచి మందే దైనా పుచ్చుగో !

మురా : పుచ్చుగుందామనేఉంది. కాని, మందెక్కడా దొర కటంలేదు !—దొరికినమందు చాలటంలేదు ! (చిరు నవ్వుతో లేచి, పెటిమల్ని నాలికతో ప్రేమగా తడుపుగుంటూ) మందు !—మందు !-(అంటూ ఆనం దంతో M. B. లోకి తూలుకుంటూ వెళ్ళిపోతాడు.)

జగ : (తెల్లబోయి మురారిని చూస్తూ) ఇంకేముంది ?— దుకాణం ఇంటికే పెట్టాడు, మహానుభావుడు !

వాణీ : (జానకి సాయంతో R. F. లోంచి వచ్చి మంచం దగ్గరికి నడుస్తూ) నమస్కారం, మామగారూ!

జగ : కూచో, వాణీనాథం!—బాగా చిక్కిపోయావుస్మా ఎన్నాళ్ళనుంచి నీకీజ్వరం ?

వాణీ : (కూచుని) నాలుగైదు రోజుల్నించండి!—ఈవాళ కొంచెం తగ్గింది!—మీకు శ్రమ అయిపోయింది, అనవసరంగా.

(జానకి R. F. లోకి వెడుతుంది.)

జగ : దానికేం లే!—కులాసాగా ఉంది, అదీ ముఖ్యం! అదిసరేగాని, వాణీనాథం!—ఏమిటి మీ అన్నయ్య సంగతి ?

వాణీ : పాపం, అలిసిపోయి పడుక్కున్నాడు.

జగ : లేదు, దాహమేసి లోపలి కెళ్ళాడు!

వాణీ: అంటే ?

జగ : (చిరాగ్గా) తాగి తందనా లాడ్డానికి ? ఏమిటీ అప్రతిష్ట పనులు ?—నలుగురూ ఇంకమనల్ని ఏమనుకుంటారు ? ఛీఛీ, అనరూ ?

వాణీ : (M. B. కేసి బాధతో చూసి) ఇప్పుడేమీ అనకండి, మామగారూ! అన్నయ్యఆరోగ్యం ఏమీ బాగా లేదు.

జగ : సరే! నీ మంచికోసమే చెప్పాను! ఆపయిన నీఇష్టం. (అంటూ లేచి) నేను అల్లా బజార్లో కెళ్ళొస్తాను.

[జగన్నాథం L. F. లోకి విసురుగా వెళ్ళిపోతాడు. వాణీనాథం తలపట్టుగుని కూచుని బాధపడి, M. B. కేసి. చూసి నిట్టూర్చి, లేచి M. B. కేసి తిరుగుతాడు. L. F. లోంచి భైరవమూర్తి కంగారుగావచ్చి, నుంచున్న వాణీనాథాన్ని చూసి నిశ్చేష్టుడై నిలబడిపోతాడు.]

భైర : (గుండెబాదుకుంటూ) ఇంకేముంది ?

వాణీ : ఏం భైరవమూర్తీ ?

భైర : (నోరు తేలేసి నిలబడిపోతాడు)

వాణీ : అదేమిటి, అల్లా నిలబడిపోయావు ?

భైర : (నీరసంగా) ఇదేమిటి, మీరిల్లా ఉన్నారు ?

వాణీ : (మంచం దగ్గరికి తిరిగి వచ్చేస్తూ) హు !!—ఏం ఎల్లా ఉన్నాను ?

భైర : అయితే మీరు మామూలుగా తిరిగేస్తున్నారా ?

వాణీ : (కూచుంటూ) ఏదో, ఈవాళే !

భైర : అయ్యబాబో !

వాణీ : (విసుగ్గా) ఏమిటోయి, నీగోల ?

భైర : నన్ను కంగారుపెట్టకండి. కవిగారూ !—సూటిగా చెప్పండి ! మీ ఒంట్లో ఎల్లాఉంది ?

వాణీ : బాగానేఉంది !

భైర : (మతోయినట్టు చూస్తూ) అయ్యబాబో!–అంతమాట అనకండీ !

వాణీ : (కోపంగా) నోర్ముయి, భైరవమూర్తీ!—ఏమిటా వాగుడు ?

భైర : క్షమించండి!—మా బాధ మీ కేం తెలుసు?—మా కిప్పుడు చచ్చే చావొచ్చింది. ఊళ్ళో పెద్దలెవ్వరికీ మతిలేదు !

వాణీ : ఏమయింది ?

భైర : ఏమీ అవలేదండి!—అదే మా బాధ !

వాణీ : (తల పట్టుగుని) ఉష్ !—భైరవమూర్తీ!—నువ్వెళ్ళిపో, నాయనా !

భైర : చిత్తం!—మరి, మీకు లోపల ఏమీ ఇదిగా లేదాండి ?

వాణీ : ఇదిగా అంటే ?

భైర : అదే!—అనారోగ్యంగా, బాధగా, మగతగా......

వాణీ : (నిట్టూర్చి, చిరునవ్వుతో) అదా నీభయం!—నీఇల్లు బంగారంగానూ!—నాకిప్పుడు చాలా కులాసాగా ఉంది! ఈవాళ పత్యంకూడా పుచ్చుగుంటాను!

భైర : (పిడుగుపడ్డట్టు చూస్తూ) ఏమిటీ?—పత్యమే!—అయితే నాకు ఊరంతా పనుంది! (అంటూ వెనక్కి తిరిగి సుడిగాలిలా L. F. లోకి వెళ్ళిపోతాడు.)

[M. B. లోంచి మురారి తూలుకుంటూ వస్తాడు.]

వాణీ : ఒక్కొక్కళ్ళని దేవుడు ఎందుకు సృష్టిస్తాడో తెలియదు !

మురా: దేముడికి కూడా చపలత్వం ఉంటుందిరా!
వాణీ : అన్నయ్యా!
మురా: (కుర్చీలో కూచుంటూ) ఏరా ?
వాణీ : (బాధతో) మళ్ళీ ఎందుకు తాగావన్నయ్యా ?
మురా: ఈవాళ పండగరా!
వాణీ : (ఆశ్చర్యంగా) ఏంపండగ ?
మురా: మురారి పండగ! (అని నవ్వి) కొన్ని సంవత్సరాల్నించి ఎదురు చూస్తున్నానురా, ఈ శుభ సమయంకోసం! కళ గొప్పదో, కళాపోషకులు గొప్పవాళ్ళో ఈవాళ తేలిపోయింది, నా చిరకాలవాంఛ తీరిపోయింది! (అని, మళ్ళీ నవ్వుతాడు.)

[K. F. లోంచి జానకి రెండు గ్లాసులతో కాఫీ తెస్తుంది.]

వాణీ : ఏమిటది, జానకీ!
జాన : కాఫీ అండి.
వాణీ : కాఫీయా?—సరుకు లెక్కడివి ?
జాన : ఏమోనండి! వొంటింటినిండా ఉన్నాయి!
వాణీ : ఎల్లా వచ్చాయి, చెప్మా!
మురా: ఊళ్ళోవాళ్ళ సప్లయిరా!—మరి, నాలుగు రోజుల్నించీ జాగారాలు చేస్తున్నారుగా ?
వాణీ : (జానకి ఇచ్చినగ్లాసు పుచ్చుకుని) వాళ్ళఋణాం ఎల్లా తీర్చుకోవాలో తెలియటం లేదు. ఈ అయిదారు

రోజులూ పట్టణంలో పెద్దా చిన్నా అంతాకూడా రాత్రి పగలూ అనకుండా, నన్ను కనిపెట్టుగుని ఇక్కడే ఉండిపోయారు, జానకీ!—చెయ్యి కదుపుతే నలుగురు వచ్చేవారు! అడిగిన వెంటనే ఎదురుగుండా పెట్టే వారు!—నిజంగా కన్నతల్లిని కూడా మరపించారు!

మురా: కన్నతల్లి!—హు! (తల వెనక్కి వేసుగుని ఆయాస పడుతూంటాడు.)

జాన : (మురారికి గ్లాసు అందిస్తూ) కాఫీ తాగండి!

మురా: (చూసి, చిరునవ్వుతో) ఇదా?—తాగండి అంటే ఏమిటో అనుకున్నాను!—ఇప్పుడొద్దు, జానకీ! కాఫీ రేపు తాగుతాను. రేపు!

వాణీ : రేపు విశేషమేమిటో!

మురా: రేపు నా పుట్టినరోజురా!—పుట్టినరోజు!-ఎల్లా మర్చి పోతాన్రా, ఆరోజు?—ఆవేళ పుట్టినరోజుగదా అని తలంటుకోమని ఎంతో బతిమాలిందిరా, మన అమ్మ! ఏమయినాసరే పోసుగోనన్నాను. 'నా నాయనకదూ! పోసుగోరా! పుట్టిన రోజునాడు తలంటుకుంటే ఆయుష్షు ఎక్కువవుతుందిరా!' అని గెడ్డంపట్టుగుని కళ్ళనీళ్ళెట్టు గుంది! కాఫీ ఇస్తే తలంటుగుంటా నన్నాను-ఎంతో ఆనంద పడిపోయింది! నన్ను దగ్గరకి తీసుగుని, ముద్దెట్టి కాఫీ కలపడాని కెళ్ళింది. కుంపటిమీదించి పాలగిన్నె దింపుతూంటే చీర అంటుకుంది!-(ఏడ్చేస్తూ)

చీర అంటుకుందిరా, నా కాఫీమూలాన్ని!—చీరతో పాటు మనిషీ అంటుకుపోయింది!—'మురారీ!—మురారీ!' అంది. కాలిపోయిన అమ్మదగ్గిరికి పరిగెత్తు కెళ్ళాను! (చెప్పలేక చెప్పలేక చెబుతూ)'ముందు కాఫీ కలుపుగుని, తాగు నాయనా!' అని చెప్పి మరీ చచ్చి పోయిందిరా, ఆ కన్నతల్లి! (అని బల్లమీదకు వాలి పోయి చంటికుర్రాడిలా ఏడ్చేస్తాడు. వాణీనాథం తల వంచుగుని దుఃఖిస్తాడు. జానకి విపరీతంగా బాధ పడుతూ, ప్రవహించే కన్నీళ్ళని ఆపుకోలేక, ఇంక నిలబడలేక గ్లాసు తీసుగుని R. F. లోకి తొందరగా వెళ్ళిపోతుంది.)

[జగన్నాథం L. F. లోంచి కోపంగా చూస్తూ, విసురుగా వస్తాడు.]

జగ : వాణీనాథం!—వాణీనాథం!

వాణీ : (ఆశ్చర్యంగా) ఏమిటండీ?

జగ : ఏమిమేమిటీ, ఖర్మ!—వచ్చానుగదా అని బజారు కెళ్ళాను!—వెడితే ఇదీ భాగోతం!'

వాణీ : ఏమయిందీ?

జగ : ఇంకా ఏమవ్వాలి నాయనా? అసలుముందు మీ ఊళ్లో వాళ్ళందరిమీదా డామేజీ దావాపడెయ్యి!—ఆ తరువాత నేను చూస్తాను!

జాన : (R. F. లోంచి కంగారుగా వస్తూ) ఏమిటి, నాన్నా?

జగ : ఇంతకన్నా దారుణం ఏమన్నా ఉంటుందమ్మా? బతి గున్నవాళ్ళని పట్టుగుని చచ్చిపోయినట్టు జమకట్టే స్తున్నారు!

జాన : ఎవరు?

జగ : ఈ ఊళ్లోవాళ్ళు!

వాణీ : ఎవర్నండీ?

జగ : ఎవర్నో అయితే నాకెందుకీ బాధ!—నిన్నే!

జాన : (హడిలిపోయి) నాన్నా!

వాణీ : నన్నా?—అసలువిషయం ఏమిటో చెప్పండి!

జగ : చెప్పాగోదగ్గ విషయమే!—రేపటిలోగా నువ్వుపోవ డం ఖాయంట! నీ శిలావిగ్రహంకూడా అప్పుడే కట్టేశారు! (జానకి భయంతోచూస్తూ బాధగా చెవులు మూసుగుంటుంది) రేపు దాన్ని ఆవిష్క రించడానికి సన్నాహాలు కూడా చేసేస్తున్నారు!

జాన : (Hysterical గా ఏడ్చేస్తూ) నాన్నా! (అంటూ మంచం దగ్గరగా కూచుండి పోతుంది.)

జగ : ఖర్మ!

వాణీ : (జానకినిఓదారుస్తూ) జానకీ!—ఊరుకో, జానకీ! తొందరపడి ఆవేశపడకండి, మామగారూ!—వాళ్ళని ఒకవేళ మీరు అపార్థంచేసుగున్నారేమో!

జగ : అపార్థం చేసుగోడానికి నే నేమీ బొడ్డూడనివాణ్ణి కాదు !— నలుగురైదుగుర్ని వాకబుచేశాకే చెబుతున్నాను ! వాళ్ళందరికీ నువ్వుపోతావనే ధైర్యం !— ఏమిటో ఆ ధైర్యంనాకు అర్థం అవటంలేదు. కాని ఆధైర్యంమీదే వాళ్ళు వేలకివేలు విరజిమ్మారు. ఉన్మాదుల్లా సర్వసన్నాహాలూ చేస్తున్నారు !— నామాటవిను, వాణీనాథం !—ఈ పరిస్థితుల్లో నువ్వు ఇక్కడ ఉండడం ఎంతమాత్రం మంచిదికాదు !

జాన : ఏమండీ ! నాకు చాలా భయంగా ఉంది !

వాణీ : (చిరునవ్వుతూ) ఏమీ భయంలేదు, జానకీ !—లేనిపోనివన్నీ ఊహించుగుని అనవసరంగా ఆరాటపడిపోతున్నారు. అంతే !—వాళ్ళసంగతి మీకు తెలియదు, జానకీ ! వాళ్ళుదయాసముద్రులు ! విశిష్టమైన కళాపోషకులు !

జగ : వేలెట్టి కన్నుపొడుస్తున్నా వెన్నపెడుతున్నారనుకునే వాళ్ళకి ఎవ్వరూచెప్పలేరు !

వాణీ : నాకు జబ్బుచేసినప్పుడు వాళ్ళంతావచ్చి చేసిన సహస్రసేవలూ మీరు చూసుంటే ఇల్లాఅనరు. ఈ పరగణాలన్నీ ఏలేజమిందారుగారికి మసింటికి రావలసిన అవసరమేమిటి ? వచ్చి నాకాళ్ళువొత్తవలసిన అగత్యమేమిటి ? ప్రజానాయకుడు, ప్రఖ్యాతవ్యక్తి అయిన ఛైర్మన్‌గారు నాకు గంటలతరబడి విసురుతూ

నిలబడిపోకూడదండీ !—నిరాదారుణంగా పొరపాటు పడ్డారు. అంతే !

ఉమ : వాళ్ళు నీకు సేవలు చెయ్యలేదంటంలేదు, నేను. చేశారు నువ్వుపోతున్నావని ! కాని, మళ్ళా ఆరోగ్యవంతు డవు అవుతున్నట్లు వాళ్ళకి తెలుస్తే ? వాళ్ళఖర్చు, శ్రమ, గౌరవమర్యాదలూ అపహాస్యమయిపోతున్నట్లు గ్రహిస్తే ?—వాణీనాథం ! —నామాటవిని నాతో వచ్చెయి !—నువ్వు ప్రజలప్రేమే చూశావుగాని, వాళ్ళకక్షలోఉండే కసాయితనం ఎరగవు !—

జాన : ఏమండీ !— పోనీ నాలుగురోజులు వెళ్ళివచ్చేద్దా మండి !

వాణీ : (నిశ్చలంగా చూస్తూ) నే నెక్కడికీ రాను !—నా ప్రజల సంగతి నాకు తెలుసు !

మురా : (విసురుగా లేస్తూ) ఏమిట్రా నీకు తెలిసింది ? పడమర చూస్తూ తూర్పువర్ణిస్తావేరా ? నీకు కాస్తరుచిచూపె ట్టినతీపి ఒక్కటే కాదురా ఈప్రపంచకంలో ఉన్నది- ఆవిర్లెత్తించే గొడ్డుకారంకూడా ఉంది !—పగబట్టి, పడగవిప్పి కాటెయ్యడానికి సిద్ధంగాఉన్న కోడెత్రాచు కళ్ళల్లో మెరిసే తీవ్రకాంక్షకి నువ్వెప్పుడేనా గురి అయ్యావురా ? ఉన్నట్టుండి ఉరకలేస్తూలేచి, విరు చుకు వ్యాపించి, అరణ్యాల్నే దహించేసే దావానలం ముందు అరక్షణం ఎప్పుడేనా నిలబడ్డావురా ?—లేదు!—

ఉసతెరిగన్ను !—ఇంక, మానుషత్వం మరిచిపోయి ప్రబలిపోయిన పశుత్వంతో మీాద కరికే ప్రజా వాహిని వెఱ్ఱికోపం నీకేం తెలుసురా ?—వెళ్ళిపో ఇక్కణ్ణుంచి !

వాణీ : అన్నయ్యా !—నాకేమీా తెలిసుండకపోవచ్చు. కాని నా ప్రజలకి నేనెప్పుడూ ఏమీా ద్రోహం చెయ్యలేదు. ఉత్తిపుణ్యాన్ని వాళ్ళు నాకెందుకు అపకారం చేస్తారు ?—అవివేక పూరితమైన ఈ ఆలోచనే అప్రస్తుతం.

జగ : అదికాదు, వాణీనాథం !—

వాణీ : మామగారూ ! దయచేసి ఆ విషయం ఇంక నాతో మాట్లాడకండి.

జగ : (కోపంగా) అయితే నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో, వాణీనాథం ! నేనుమాత్రం ఈ దారుణ సన్నాహాలు చూస్తూ, నీ తెలివి తక్కువ వాగుడు వింటూ కూచోలేను ! (గద్గదికంగా) నేను వెడుతున్నాను.(అనిL. F. కేసి తిరుగుతాడు.)

జాన : (తెల్లబోతూ) నాన్నా !

మురా: మామగారూ ! మీారిప్పుడెళ్ళడం అంతమంచిదికాదు !

జగ : ఉండడం అంతకన్నా మంచిదికాదు.

[జగన్నాథం తలవంచుగుని ఆవేదనతో, L. F. లోకి వెళ్ళిపోతాడు.]

జాన : (బాధగా, వెనక్కాలే వెడుతూ) నాన్నా !-నాన్నా

వాణీ : (గట్టిగా) జానకీ ! (జానకి ఆగి తెల్లబోతుంది. వాణీ నాధం అభిమానంతో) నామీద నా ప్రజలమీద నమ్మకం, గౌరవంలేని వాళ్ళెవరూ నా ఇంట్లో ఉండక్కర్లేదు !—వెడితే నువ్వుకూడా వెళ్ళచ్చు !

[జానకి ఏడుపు ఆపుగుంటూ వెనక్కితిరిగి విసురుగా R. F లోకి వెళ్ళిపోతుంది. వాణీనాధం తలపట్టుగుని మంచం మీద కూచుండిపోతాడు. మురారి బల్లదగ్గిరే తాపీగా బీడీ కాలుస్తూంటాడు. L. F. లోంచి జనతారావు, శంకరయ్య, హనుమంతరావు, పరంధామయ్య మాటలేకుండా వచ్చి, వాణీనాధాన్ని చూసి తెల్లబోయి నిలబడిపోతారు.]

మురా : (హెచ్చరిస్తున్నట్లు) తమ్ముడూ !

వాణీ : (పరాకుగా తలఎత్తి మురారి పక్కని ఉన్నవాళ్ళని గుర్తించి, తెల్లబోయిలేచి చిరునవ్వుతో) నమస్కారం, ఛైర్మన్‌గారూ !—పెద్దలంతా ఒకసారే దయచేశారే ?—చాపతెస్తానుండండి.

జన : ఏమీవద్దు ! –ముందు మీరామంచంమీద కూచోండి.

వాణీ : (చిరునవ్వుతో) ఫరవాలేదండీ !—

శంక : అలాక్కాదు. తమరు నుంచుంటే—ఎదీ ?—మాకు మాటరాదు !—దయచేసి కూచోండి !

వాణీ : (నిట్టూర్చి) మీమాట కాదనగలనా ? (అంట్లూ కూచుంటాడు.)

జన : (చిరునవ్వుతో) ఆ ధైర్యంమీదే తమదగ్గరికి వచ్చా
మండి !—తమకిప్పుడు వొంట్లో ఎల్లాఉంది !

వాణీ : చాలాబాగుందండి. తమదయవల్ల జ్వరంతగ్గిపోయిం
దండి.—ఈవాళ పత్యం పుచ్చుగుందామను కుంటు
న్నాను !

పరం : (ఆశ్చర్యంతో) అయితే ఇప్పుడు మీరు మామూ
లుగా తిరగగలుగుతున్నారా ?

హను : ఇంకా సందేహమా, మేష్టారూ ?—కనపడటంలే ?

పరం : (నిరుత్సాహంతో) నాలుగైదురోజుల్నించి నిక్షే
పంలా ఒళ్ళెరగడాయన ! —చూస్తూండగా ఎంత
మార్పొచ్చేసిందీ !

శంక : (ఆదుర్దాగా వెళ్ళి,కవిగారి ఒళ్ళుపరీక్షించి, పెదవివిరిచి)
అబ్బే, జ్వరం బొత్తిగా లేదండి !

జన : (నెర్వస్‌గాచూస్తూ) కవిగారూ !— మీరోమాటు
ఆ చివరదాకా వెళ్ళిరండి !

[వాణీనాథం అందర్నీ ఆశ్చర్యంతో చూసి, మెల్లిగా
లేచి R. F. దాకా వెళ్ళి, తిరిగి మంచందగ్గరకి వస్తాడు.]

పరం : (ముక్కుమీద వేలేసుగుని) చ్చుచ్చుచ్చు ! —ఇంక
లాభంలేదండీ జనార్దనరావుగారూ !

జన : మతోయినట్టు చూస్తూ మేష్టారూ !-మాట! (అంటూ
పరంధామయ్య భుజంమీదతట్టి L. F. లోకి కంగా
రుగా తీసుగుపోతాడు. మరోక్షణం అయ్యాక పరం

ఖామయ్య ఏడుపు మొహంతో L. F. లోంచి తిరిగి వస్తాడు.)

పరం : హనుమంతరావు!—మాట! (అంటూ హనుమంత రావు భుజంమీద తట్టి L. F లోకి కంగారుగా తీసుకుపోతాడు. మరోక్షణం అయ్యాక హనుమంత రావు అతి విచారంతో L. F. లోంచి తిరిగివస్తాడు.)

హను: శంకరయ్యగారూ!—మాట! (అంటూ శంకరయ్య భుజంమీద తట్టి L. F. లోకి కంగారుగా తీసుకు పోతాడు.)

[జానకి R. F. లోకి వచ్చి తెల్లబోయి చూస్తుంది. మురారి చురుకుగా లేస్తాడు.]

జాన : (ఆదుర్దాతో) ఏమిటిదంతా ?

మురా: అసలు రంగుల విన్యాసం!—తమ్ముడూ! ఇప్పుడేనా వెళ్ళిపో! (అంటూ R. F. కేసి చూపిస్తాడు.)

వాణీ : (చిరకోపంతో) చాల్లే. అన్నయ్యా!—ఇందాకట్నుంచి చూస్తున్నాను. వెళ్ళిపో, వెళ్ళిపో అని తెగ కలవ రిస్తున్నావు!—నేనెందుకు వెళ్ళాలి?—ఏమిటసలు నీ ఉద్దేశ్యం ?

మురా: శక్తి లేదు గాని నిన్నిప్పుడు గోడవతల గిరవ టెయ్యాలి—కళ్ళు తెరిపించడమేగాని, కళ్ళు మూయిం చడం కాదురా నా ఉద్దేశం !

వాణీ : నీకు మతిలేదు.

మురా: (నొక్కి పలుకుతూ) నీకు గతివుండదు! (అని విసురుగా M. B. లోకి వెళ్ళిపోతాడు.)

[వణుకుతున్న చెయ్యి నోటికి అడ్డం పెట్టుకుని, చెప్ప లేని భయంతో, బాధతో నిలబడిపోయిన జానకిని ఖిన్నుడై చూస్తూంటాడు, వాణీనాథం. L. F. లోంచి జనతారావు, పరంధామయ్య, హనుమంతరావు శంకరయ్య వస్తారు. జానకి కంగారుగా R. F. లోకి వెళ్ళిపోతుంది.]

వాణీ : (చిరునవ్వు తెచ్చిపెట్టుకుని లేచి) దయచెయ్యండి, జనతారావుగారూ! ఏమిటి అల్లా వెళ్ళిపోయారు?

జన : ఆ, ఏంలేదు! —తమరు ముందు కూచోండి!— (వాణీనాథం కూచుంటాడు.) కవిగారూ!—మేం ఇప్పుడు చెప్పుకోలేని దురవస్థలో పడిపోయాం. కాని, మా మనస్సులు నిష్కల్మషం అని తమరు గుర్తుంచుకోవాలి.

వాణీ : తమరంతా నిలబడేవున్నారు!

శంక : ఫరవాలేదండీ!—ఇక అసలువిషయం. మొన్న మీకు చాలా తీవ్రంగా జబ్బుచేసింది. అసలు మాలో లేరు. పరిస్థితి కొంచెం—ఎదీ?—ప్రమాదకరం అనిపించింది.

హను : మిమ్మల్ని పూజించుకుంటున్న మాకు పిడుగుపడ్డట్టయింది,

పరం : వెంటనే వెళ్ళి, లండనులో చదువుకొచ్చిన డాక్టర్ని రప్పించాం. ఆయనకూడా పరీక్షించి ఏమీలాభం లేదన్నాడు.

వాణీ : ఆ !—

శంక : ఆ !—దాంతో మా ప్రాణాలు నిజంగా—ఎదీ ?— నీళ్లు కారిపోయాయనుకోండి. దానికిసాయం నాలు గైదు రోజులకన్నా తమరుబతగరని ఆ డాక్టరు కచ్చితంగా చెప్పేశాడు !

జన : దాంతో మాఆవేదన ఎక్కువయిపోయింది. పట్టణానికీ దేశానికీ కూడా వన్నె తెచ్చిన మిమ్మల్ని శాశ్వతంగా స్మరించుగుంటూ పూజించుకోడానికి అపూర్వమైన శిలావిగ్రహం నిర్మించాలని నిర్ణయం చేశాం. అన్నపానాలుమానేసి, శ్రమ, డబ్బు విర జిమ్మేసి, అనుకున్నప్రకారం శిలావిగ్రహం తయారు చేసేశాం !

పరం : వాణీనాథంగారూ ! —ఆ శిలావిగ్రహం ఎంతముద్దొస్తోందనుకున్నారూ ? —ముమ్మూర్తులా తమరే స్వయంగా చిరునవ్వుతో నిలబడ్డారా—అనిపిస్తోంది !

హను : అవునండి !—తమరు చూసితీరాలి !

వాణీ : ఎంత అంతఃకరణమిది !

జన : చిత్తం !—ఆ శిలావిగ్రహం, తద్వారా తమ నామధేయం ప్రపంచ ప్రఖ్యాతి పొందాలన్న ఆపేక్షతో నే-

తమరు—క్షమించాలి! —స్వర్గస్థులైన వారం తిర క్కుండానే పెద్దమంత్రిగారిచేత Open చేయించా లన్న ఉత్సాహంతో మంత్రిగారికి రేపని తారీకు ఇచ్చేశాం!

శంక : పెద్దమంత్రిగారు రేపు వచ్చేస్తున్నారు!

హను: శిలావిగ్రహం సిద్ధంగా ఉంది!

వాణీ : (తెల్లబోయి) ఆ!—ఎంతపనిచేశారు!

జన : చిత్తం!—సర్వం తెలుసున్నవారు, మీకుచెప్పాలా? ఇప్పుడు మన పట్టణప్రతిష్ఠ, మా జీవితాలు, మాగౌర వాలు, మాభవిష్యత్తు అన్నీ మీచేతుల్లో ఉన్నాయి.

వాణీ : నాచేతుల్లోనా?

జన : చిత్తం!

వాణీ : (వెఱ్ఱివాడిలా చూస్తూ) ఇప్పుడు నన్నేం చెయ్య మంటారు?

శంక : చెయ్యమని చెప్పేశక్తి మాదగ్గరఉందా?—తమ సహకారం—ఎదీ?—Cooperation అర్థిస్తున్నాం!

వాణీ : (వెలవెలబోతూ) అంటే?

జన : కవిగారూ! పవిత్రమైన ఈ పట్టణ ప్రతిష్ఠ యథా ప్రకారం వర్ధిల్లాలంటే, మేమంతా, అంటే మీ పట్ట ణంలో ప్రతీమనిషీ—అపవాదులపాలై అవమానంతో ఉగ్గోసుగు చచ్చిపోకుండా ఉండాలంటే, బ్రహ్మాండ మైన తమ శిలావిగ్రహం శాశ్వతంగా నిలబడి ప్రపంచ

చరిత్రలో సుస్థిరమయిపోవాలంటే—తమరు, రేపటి లోగా దయచేసి—కొంచెం, మరణించాలి !

(వాణీనాథం పిడుగుపడ్డట్టు అదిరి లేస్తాడు)

శంక : తమరు ఆమాత్రం సాయంచేస్తే చాలు ! తమ విగ్రహానికి ప్రతీరోజూ సువర్ణపూజ చేయిస్తానని ప్రమాణం చేస్తున్నాను !

పరం : ప్రతీరోజూ క్లాసులో కెళ్ళగానే పదినిమిషాలపాటు తమ ఘనత స్తుతించి, ఆ తరవాతే పాఠం ప్రారంభిస్తాను !

హను: ప్రతీఏడూ మీావర్థంతికి ఓ పదివేలు నా జేబులోంచి ఖర్చుపెడతాను, ఊఁ అనండి !

వాణీ : (చెవులు మూసుగుని, పిచ్చిగా చూస్తూ, అంతులేని ఆవేదనతో) ఆపండి, మీావాగుడు!—ఏమిటీ దారుణ ధోరణి !—నేనిప్పుడెక్కడున్నాను!—నాతల తిరుగు తోంది !

శంక : (ఆనందంతో) తల తిరుగుతోందా?–అయితే వెంటనే పడుకోండి !

వాణీ : (విదిలించుగుని) శ్రమపడకండి, శంకరయ్యగారూ !–నాప్రాణం ఇప్పుడుపోదు !—జనతారావుగారూ !—చివరికి మీా ఆదరణ ఇల్లాతిరిగిందా ? ......(కన్నీళ్ళతో) 'అరసికేషు కవిత్వనివేదనం శిరసిమాలిఖ మాలిఖ మాలిఖా' అని ఏడ్చిన కవి పరిస్థితికూడా

నాకంటే నయమనిపిస్తోంది. నాప్రజలనీ, నాహితులనీ మనసార్గా ప్రేమించాను. గౌరవించాను !—మీరు ఆదరించినా, ఉపేక్షించినా నాసర్వశక్తులూ ధారపోసి జీవితపరమావధిగా భావించి మనభాషకి సేవచేశాను!—నాసేవలు ఉపయోగించుకోమన్నానేగాని, నేను మిమ్మల్నేమీ కోరలేదుగా ? (దుఃఖానికిలొంగిపోతూ) నన్నిల్లా బతగనియ్యండి. చాలు !—నన్నేబలికోరే ఈ కీర్తిప్రతిష్టలు నాకెందుకు కట్టబెడతారు ?

జన : (నిట్టూర్చి) తమరల్లా అంటే మేమేంచెప్పగలం ?

వాణీ : మీరేం చెప్పక్కర్లేదండీ !—నేనుచెబుతాను !—మీరేంచేసినా సరే ! —మనుషులిస్తున్న ఈకీర్తి ప్రతిష్టలకోసం దేవుడిచ్చిన నానిండుజీవితాన్ని చేతులారా నేను నాశనంచేసుగోడం కల్లోమాట !

జన : తొందరపడకండి, కవిగారూ !—మళ్ళీ ఆలోచించండి. కవిజీవితానికి సార్థకత కీర్తిప్రతిష్టలేకదా ? నిండైన కీర్తి ప్రతిష్టల్ని ముందేకలగజేస్తున్నాం.—ఇంకా ఈ క్షణభంగురమైన దేహంగురించి ఆలోచన ఎందుకండీ కవిగారూ !

హను : తుప్పరవచ్చినా, తుఫానువచ్చినా, చెక్కుచెదరకుండా, తరతరాలూ నిలిచే శిలావిగ్రహమండీ !

వాణీ : (ఆవేశంతో ఏడుస్తూ, గట్టిగా) శిలావిగ్రహం, శిలావిగ్రహం—శిలావిగ్రహం !!— మీదృష్టిలో నిర్జీవ

మైన ఆ శిలావిగ్రహం మీకు సర్వస్వం. సజీవమైన ఈ అభాగ్యుడు సూన్యం !—అంతే కదూ ?

మురా : (లేస్తూ) నిజం ఎప్పుడూ చేదుగా ఉంటుందిరా !— బాధపడకు ! — ఎందుకీగొడవ ? నేనో ఉపాయం చెప్పనా ?

జన : చెప్పండి. మురారిగారూ !—చెప్పండి !

వాణీ : ఏమిటది ?

మురా: వాళ్ళ ప్రార్థన ఏమిటో నీకు తెలిసిందిగా ?—ఇంకా నువ్వాల్టే పాకులాడక్కర్లేదు. నీ వాణీనాథం పేరు ఇక్కడ వదిలెయి ! అనామకుడవయి ఈ దేశంనుంచి వెళ్ళిపో !—మరోదేశం వెళ్ళి నీ ఇష్టంవచ్చిన పేరెట్టుగు బతుగు !—వాణీనాథం లేడుగా ? అంచేత చచ్చిపోయాడని శిలావిగ్రహం రేపు Open చేయిం చేస్తాం !

జన : మురారిగారూ !—మీ ఆలోచన అద్భుతం !

శంక : అద్భుత మేమిటండీ, జనతారావుగారూ !—దివ్యం దివ్యంగాఉంది. మరోమాట లేకుండా ఈసారికి— ఎదీ ?—ఇల్లాకాని చ్చెయ్యండి, వాణీనాథంగారూ !

మురా: అవును !—

వాణీ : అన్నయ్యా ?—ఉచ్చం నీచం విస్మరించి ఉన్మత్తుల్లా ప్రవర్తించే వీళ్ళతో నువ్వుకూడా చేరి నన్నుమరీ క్షోభపెట్టకు !—నాపేరు, నాదేశం, నాకు సర్వస్వం

అనామకుణ్ణయి ఈ దేశంనుంచి పారిపోవాల్సిన అప్రభంసపు పని నే నేమీ చెయ్యలేదు! —నే నిక్కణ్ణుంచి కదలను.

[L F..లోంచి కంగారుగా జమీందారు, డాక్టరు గంగాజలం, భైరవమూర్తి, గురవయ్య, గోపాలం చక్కా-వస్తారు.]

శంక : కవిగారూ !—అయితే మాగ తేమిటి ?

వాణీ : చేసుగున్న ఖర్మ దోసెళ్ళతో అనుభవించడమేగతి !—

జమీం: జనత్తారావుగారూ ! ఏమిటీ దారుణం ?

జన : పిన్నారుగా ?

జమీం: (తెల్లబోయి, నెర్వస్‌గా ఇటూ అటూచూసి, డాక్టర్ని గుర్తించి, కోపంతో) అసలిదంతా ఈ డాక్టరు మూలాన్నే వచ్చింది !

గంగా : (చిరికోపంతో) నేనేం చేశానండి !

జమీం: ఏం చేశానంటావేమిటయ్యా ?—మా కొంపలు తీశావు ! ఆమనిషిని పట్టుగుని నాలుగురోజుల్లో పోతాడని ఏల్లా చెప్పావయ్యా ?—చూడు, ఎల్లా తిరుగుతున్నాడో.

డాక్ట : తొందరపడి మాటలనకండి, జమీందారుగారూ ! నాకంటే పెద్దవాడూ, ఈ దేశంలోనే Expert అయిన డాక్టరు రావుగారి Reports, ఆరోగి ప్రస్తుతపరిస్థితి

కనుక్కొని, చూసి అల్లాచెప్పాను !—అదృష్టం తిరగ బడి ఆయుర్దాయం పెరిగితే మధ్య నేనేం చెయ్యను ?

**జమీాం :** (విసుగ్గా) అదృష్టం లాగే ఉంది !-అసలా Report ఎదీ ?

**గంగా :** (మురారినిచూపిస్తూ) ఆయన్ని అడగండి !

జమీాం : ఎవండీ ఆ Fep(rts మురారి గారూ !

**మురా :** లేవు !

జమీాం : అంటే ?

**మురా :** అంతే !

**శంక :** మురారిగారూ !—

గంగా : మురారి, కవిగారిపేరు కదూ ?

జమీాం : కాదు !—వాశీనాథం !—మురారి అని ఎవరు చెప్పారు ?

గంగా : ఆయన ! (అని **మురారిని చూపిస్తాడు.**)

జమీాం : ఆయనపేరే మురారి !

గంగా : అయితే చాలా మోసం జరిగింది !—

శంక : (తెల్లబోయి) మోసమా !

పరం : (ఆవేశంతో) మోసం !—మోసం !

(అక్కడ చేరిన అందరూ వెంటనే 'మోసం!-మోసం !' అంటూ కేక లేస్తారు.)

జమీాం : (గట్టిగా) ఆగండి !—(తెల్లబోయి అంతా ఆగిపో తారు.) డాక్టరుగారూ !—ఏమిటీ మోసం ?

గంగా : కవిగారి పేరు మురారి అని చెప్పి, మురారి అన్న పేరుతో ఉన్న X-Ray photo, ఇంకా ఇతర కాగితాలు ఆయన తీసుగొచ్చి నాకు చూపెట్టాడు. అవి చూసిన ఏడాక్టరేనా చెబుతాడు; మురారి Case hopeless అని!

జమీం : ఎంత దారుణం జరిగింది!

శంక : ఇదంతా కవిగారికుట్ర!

హను : గారు!—కవి మనకి ద్రోహం చేశాడు!—మనని వెఱ్ఱివాళ్ళని చేసి మనచేత డబ్బుఖర్చు పెట్టించి, మన పరువు మర్యాదలు మంటగలిపాడు!

వాణీ : (అమితంగా బాధపడుతూ, వినయంగా నమస్కరిస్తూ) మీరంతా పెద్దలు!—అనవసరంగా ఆవేశపడకండి! కన్నీళ్ళతో ఆ భగవంతుడిమీద ప్రమాణం చేసి చెబుతున్నాను!—నేనే పాపమూ ఎరుగను.

జమీం: (ఆవేశంతో) అయితే మేమేనా పాపం చేసింది?— కవివిగదా, ఏదో రాస్తున్నావు, పోనీ గౌరవం చేద్దాం అని మేంచూస్తే మాకే వెనకపోటు పొడుస్తావా? ఎంత స్వామిద్రోహం!—మా పరువు మర్యాద లతో జూదమాడతావా? ఎంతసాహసం!—కవీ! పట్టణంలోని మనిషి మనిషినీ నువ్వు నిలువునా అవ మానించావు!—దేశంలో వర్ధిల్లుతున్న కవిత్వానికి,

కళకీ తీరని కళంకం తీసుగొచ్చారు!—నువ్వు బతి
గుండడమే దేశానికి మచ్చ!

హాను: అవును!—(వెఱ్ఱిఆవేశంతో) కవినిచంపి కవిత్వాని
కాపాడండి!

శంక : అంతే!—కవినిచంపి, శిలావిగ్రహం నిలబెట్టేద్దాం!

[L. F పైవున్న ఆ జనమంతా అర్థంలేని ఉద్రేకంతో అంతులేని ఆవేశంతో 'కవిని చంపండి!—చంపెయ్యండి!—చంపండి!' అంటూ కేకలేసేస్తారు. విపరీతమైన, ఆకోలాహలంతో వెఱ్ఱెక్కిపోయిన జమీందారు: వళ్ళుమరిచిపోయి. మొలలోంచి బాకుతీసి, విసురుగా పైకెత్తి, పసుకోపంతో ముందుకినడుస్తాడు. కత్తిచూడగానే R. F. లోంచి జానకి కెవ్వుమని అరిచి, ఏడుస్తూ వాణీనాథాన్ని చుట్టేసుకుంటుంది.]

వాణీ : (బాధగా, భయంగా, మెల్లిగా) జమీందారుగారూ!

జమీం: (వెనక్కితిరిగి) రండి!— (అనిగర్జించి ముందుకు
తిరుగుతాడు. జనం "చంపండి!–చంపండి" అంటూ
కేకలేస్తూ జమీందారుతో వచ్చేస్తారు.)

మురా: (జమీందారుకి నిలువునా అడ్డం నిలబడి, గట్టిగా)
ఆగండి!—ఆగండి!

[తోసుగొస్తున్న జనసమూహం ఒక్కసారి ఆగిపోతుంది.]

జమీం: ఏమిటి నువ్వనేది ?–

మురా: (నిశ్చలంగా చూస్తూ నిబ్బరంగా పలుకుతూ) ఇక్షిప్పి నేను చంపుతాను!—మీాకంటూ ఎక్కువ ద్రోహం నాకు చేశాడు, ఈ కవి!

(జనంలో కోలాహలం రేగుతుంది. జమీాందారు తెల్లబోయి నిలబడిపోతాడు.)

ఘంశ్రే: (నిలువునా నీరయిపోయి) అన్నయ్యా!—

మురా: (జమిందారు చేతులో కత్తి లాక్కొని విసురుగా వెనక్కి తిరిగి) ఎవడ్రా అన్నయ్య!—దేముణ్ణి తలుచుగో!

జాన: (ఏడుస్తూ, పోతీకిపోతూ) బావగారూ!-బావగారూ!

మురా: నోర్మూయి!—అడ్డువచ్చావా పీక ఎగిరిపోతుంది! (జానకి రోషంతో ముందుకొస్తుంది. మురారి జానకిని పక్కకి తోసేస్తాడు. జానకి Hysterical గా కెవ్వుమని అరుస్తూ కిందపడిపోతుంది.)

ఘంశ్రే: (ఆందోళనతో) జానకీ!-(కోపంతో బిగుసుకుపోయి) అన్నయ్యా!—

మురా: (మెల్లిగా, తాపీగా) ఏమయ్యా, కవీ!-నీకు శాశ్వతమయిన కీర్తి కలగజేస్తాం, పూజిస్తాం, కొంచెం చచ్చిపొండి అని వాళ్ళు బతిమాల్తూంటే వాళ్ళమాట కాదంటావా, నువ్వు?—ఎంత కండకావరం!

జమీాం: అల్లా అడగండి!

(జనంలోంచి 'అదీమాట!—అన్న మెప్పు)

సురా: డాక్టరుకి కాగితాలు చూపెట్టి, అబద్ధాలు చెప్పింది నేను!–నువ్వు మోసం చెయ్యలేదని అందరికీ తెలుసు. మోసంకూడా చెయ్యగల్రా కవులు!—హు!—చేసింది, నేను!—(జనంలో కలకలం.) ఎందుకు చేశాను?—పగ సాధించడానికి!—కసి తీర్చుగో డానికి! అసలు కవిగా నిన్నెవడు ఈ తెలుగు దేశంగో పుట్టమన్నాడు? పుట్టినవాడవు కిక్కురుమనకుండా మామాటప్రకారం నడుచుగోవాలి, అంతే! (జనంలో అంగీకారం కనిపిస్తుంది.) మేమంటే ఎవరనుకున్నావు? కళలూ, కవిత్వాలూ, కావాలంటూ అఘోరించే అవి వేకులం కాదు మేం!—ఎదీ?—మన దేశంలో ప్రపంచ ప్రఖ్యాతి తెచ్చుకోగలిగిన ఒక ఆధునిక కవినిగాని, గాయకుణ్ణిగాని, నటుణ్ణిగాని, శిల్పినిగాని, మరి ఏ ఇతర కళాకారుణ్ణి గాని చూపెట్టు!—నీ తరంకాదు! అదీమాప్రజ్ఞ! మేం చెప్పుగుని సంతో షించడానికి ఇదివరకున్న కవులూ, కళాకారులూ చాలుమాకు! (ఆవేశంతో) నన్నయ మావాడు! (అంటూ జనంకేసి చూస్తాడు.)

భాను: (ఉప్పొంగిపోతూ) తిక్కనమావాడు!

పరం: (హాయిగా) త్యాగరాజుమావాడు!

జన: ఆహా!—అజంతా అమరావతీ శిల్పాలన్నీ మావే!

మురా॰ : (కసితో) ఇంక మేం దద్దమ్మలమయితే మాత్రం ఏం?
మేం అల్పసంతోషులం! ఇంక మీతో పనేముంది
మాకు? అయినా చచ్చినవాళ్ళందర్నీ గౌరవిస్తున్నాం.
తెలుగు దేశంలో కవీ, కళాకారుడూ బతికున్న
న్నాళ్ళూ ఛస్తారు. చచ్చాకే మా దయుంటే బతుకు
తారు. అదీ మా తెలుగు ఆచారం!—ముందు వెను
కలు ఆలోచించకుండా మా ఆచారాన్నే అవమాని
స్తావా, నువ్వు?—కావలిస్తే తెలుగుచరిత్ర తిరగెయి!
ఎంతోమంది గొప్ప గొప్ప కవులూ, కళాకారులూ
బతికున్నన్నాళ్ళూ మాచలవకొద్దీ దరిద్రంలో శిఖ
రాగ్రాన్ని అందుకుని మరీ చచ్చిపోయారు!—తగ
లెయ్యడానికి డబ్బులేక అందులో కొందరి శవాలు
ఇళ్ళముందు నిలిచిపోతే. పనిలేనివాళ్ళచేత ముష్టె
త్తించి, ఎల్లానూ చచ్చిపోయారుగదా అని చందా
లిచ్చాం—అదీమా ఔదార్యం!—మీ కవిత్వం కళా
చూసి కావలిస్తే ఓహో అంటాంగాని బతికుండగా
కాళ్ళట్టుకున్నా కానీ ఇవ్వం!—అదీ మా పవిత్ర
సిద్ధాంతం!—మా ప్రజ్ఞని, ఆచారాల్ని, అవమానిం
చావు!—మా ఔదార్యాన్ని, సిద్ధాంతాల్ని తృణీక
రించావు!—నువ్వు బతికుండడం మన సంస్కృతికీ
జాతికీ కూడా తీరని కళంకం! నువ్వు తమ్ముడని
చెప్పుకోడం ముందునాకు మహాపాపం!— మహా
పాపంరా—మహాపాపం!

[అంటూ విసురుగా వెళ్ళి వాణీనాథంచొక్కా పట్టుకుని కత్తిఎత్తుతాడు. వాణీనాథం కళ్ళుమూసుకుని నిలబడి పోతాడు. జనంలో సంచలనం బయల్దేరుతుంది. జమీందారు గబుక్కుని మురారి చెయ్యిపట్టుకుని ఆపుతాడు.]

జమీం: ఆగండి, మురారిగారు? తప్పుచేసినా, తృణీకరించినా తమ్ముడేకదా?— కసాయివాడికింద ఖూనీ చేస్తారా?

మురా: వొదలండి, జమీందారుగారూ!— వెధవ దేశద్రోహం చేశాడు!

శంక : ఏమీ చెయ్యలేదు, మాకు తెలుసు!— అయినా తాగుబోతువి నువ్వు కబుర్లు చెబుతావేమిటి?

జమీం: తాగుబోతా?

శంక : మరేనండి!—(మురారితో గట్టిగా) వొదిలెయ్ ముందు:—ఆయన మాకని!

జన : తాగుబోతా?— పట్టపగలు ఖూనీచెయ్యబోసి వచ్చాడు పచ్చిరౌడీలాగ!—తోసెయ్యండి వెధవని!

[అని మెడబట్టి జనంలోకి గెంటేస్తాడు. "తోసెయ్యండి, ఈడ్చెయ్యండి!—లాగెయ్యండి!" అనిజనంలోంచి కేకలు ఎక్కువవుతుండగా మురారిని బలవంతంగా L. F. లోకి లాగేస్తారు.)

వాణీ : (ఎంతో బాధతో, అప్యాయంతో ఏడుస్తూ)అన్నయ్యా! అన్నయ్యా!

సూను: (ఆనందంతో, ఉద్రేకంతో) ఇదంతా తాగుబోతు మురారిపన్నాగం!—కవిగారునిర్దోషి!—మనఅదృష్టం కొద్దీ కవిగారు బతికారు!—శిలావిగ్రహం ప్రక్కనే కవిగార్ని కూడా కూచోబెట్టి సన్మానం చేసేద్దాం!

[చెయ్యాలి!-చెయ్యాలి! అని జనంలోంచి కేకలు]

వాణీ: (ఏడుస్తూ) అన్నయ్యా! (అంటూ ముందుకు తోసుకు వెళ్ళిపో బోతాడు.)

జమీం: (ప్రేమతో, ఆదరపూర్వకంగా ఆపి పట్టుకుని) కవిగారికి జై!

[అంటూ జనతారావు సహాయంతో కవిని చేతుల మీదకి ఎత్తుకుంటాడు. ఉత్సాహపూరితులైన జనంలోంచి 'కవిగారికి జై!' అన్న నినాదాలు మిన్నుముట్టుతాయి. వాణీనాథం మురారికోసం ఆదుర్దాగా చూస్తూ విలపిస్తూనేఉంటాడు. ఆ సంతోష సమూహం ఈ వాణీనాథాన్ని L. F.లోకి తీసుకుపోతారు. జేజేలు మళ్ళీ ఎక్కువవుతాయి. మెల్లిగా తగ్గుతూంటాయి. మురారి నెత్తురు కక్కుగుని, గాయాలతో నిండిన శరీరంతో, తూలి పడుతూ L. F. లోంచి వచ్చి, బల్లని ఆనుకుని, కళ్ళు తేలేసి, హాలు మధ్యగా పడిపోతాడు. తెలివిలోకి వచ్చిన జానకి, భర్తమీద దృష్టితో కంగారు పడిపోతూ L. F. లోకి పరిగెత్తబోయి కుప్పలా ఉన్న మురారిని గుర్తించి విపరీతంగా ఏడ్చేస్తూ పక్కనే కూచుండి

పోయి' బావగారూ!—బావగారూ!' అంటూ అతని తల పైకి ఎత్తుతుంది. మురారి జానకిని ఒక క్షణం చూసి, చిరునవ్వుతో L. F. కేసి కళ్ళు తిప్పుతాడు. L. F. లోంచి. "అన్నయ్యా!-అన్నయ్యా!" అని అరుస్తూ, ఏడుస్తూ, చిరిగిన బట్టలతో, చెదిరిన వాలకంతో నాణీనాథం బాణంలా వచ్చి అన్నగారిమీద పడి ఏడుస్తాడు. L. F. లో కోలాహలం వినపడుతూనే ఉంటుంది.]

తెర

సమాప్తం